

రాజు వానప్రస్థం (బే.క) 19



మల్లెల యువరాణి 38



మాయాసరోవరం 11



మానవధర్మం 51



## ఈ సంచికలో



SUBSCRIPTION

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
**to**
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ.120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':

ఈ పత్రికలో ప్రకటనల
కోసం సంప్రదించండి:

చెన్నయ్
ఫోన్: 044-234 7384,
234 7399

ఢిల్లీ
మోనా భాటియా
ఫోన్:011-651 5111/
656 5513/656 5516

ముంబాయి
షకీల్ ముల్లా
మొబైల్ :98203-02880
ఫోన్: 022-266 1599/266 1946/
265 3057

# HEY PEOPLE! TELL US HOW CLOSE YOU'RE TO POPEYE AND YOU COULD WIN A POPEYE WATCH FROM DASH!




Put your knowledge on Popeye to test by ticking the right answers to the following questions and you could win an exciting Dash! watch.

1. What does Popeye do for a living? He's a
   a. Sailorman ☐ b. Tailorman ☐
   c. Cobblerman ☐

2. What's Popeye's source of strength?
   a. Roast Beef ☐ b. Hotdogs ☐
   c. Spinach ☐

3. What's Popeye's girlfriend's name?
   a. Olive Oyl ☐ b. Coconut Oyl ☐
   c. Sunflower Oyl ☐

**Now dash this contest form to:**
The Dash! Chandamama Contest,
Titan Industries Ltd, Airport Road,
Bangalore-560 017.

**My name is:** ____________________
**I am a Boy☐ Girl☐. I am ______ years old**
**My address is:** ____________________
____________________
**Tel:** ____________________
**I read Chandamama in English ☐ Hindi ☐**
**Others ☐ (Please specify)** __________

**Rules and regulations:**
1. Judges decision is final and binding.
2. Incomplete forms will not be considered.
3. Prizes are not exchangeable in lieu of cash.
4. All entries should reach us by 15th May 2002.



Rs. 295 onwards.

DASH!

Wow watches from Titan

## హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 7

శాస్త్రీయ సంగీతంలో సుసంపన్నమైన సంప్రదాయం కలిగిన దేశం మనది. కొందరు సంగీత విద్వాంసులకు సంబంధించిన ప్రశ్నలు ఇక్కడఉన్నాయి. వాటిలోమీకుఎన్నిటికిసరైనసమాధానాలు తెలుసో చూద్దామా?

**అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!**



1 కర్నాటక సంగీత త్రిమూర్తుల్లో ఒకరయిన ఆయన 24,000 కీర్తనలు రచించాడు. కావేరి నదీ తీరంలోని తిరువైయారులో ఆయన సమాధి ఉంది. ఆయన పేరేమిటి?

------------------------------------------

2 గొప్ప తబలా విద్వాంసుడైన ఆయన కారణంగా ఆ వాయిద్యానికే విశిష్టస్థానం లభించింది. ఆయన కుమారుడు జాకీర్ హుస్సేన్ కూడా ఆయనకు సాటి రాగల తబలా కళాకారుడే. ఆయన ఎవరు?

------------------------------------------

3 ఈ సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు అక్బర్ చక్రవర్తి ఆస్థానాన్ని అలంకరించాడు. ఆయన 'రాగ్‌దీపక్' రాగాన్ని ఆలపిస్తే దీపాలు తామంతట వెలిగేవని చెబుతారు. ఆయన పేరు మీకు గుర్తుందా?

------------------------------------------

4 ఆయన గొప్ప షెనాయ్ విద్వాంసుడు. గత సంవత్సరం ఆయనకు 'భారత రత్న' అవార్డు కూడా ఇచ్చారు. ఆయన ఎవరు?

------------------------------------------

5 పూర్వాశ్రమంలో శ్రీనివాస నాయక్ అనే పేరు గల ఆయన గొప్ప సంపన్నుడు. ఉత్తరోత్తరా ప్రాపంచిక సుఖాలను త్యజించి సన్యసించిన ఆయనే కర్నాటక సంగీతానికి పునాదులు వేశాడు. ఆయన పేరేమిటో చెప్పగలరా?

------------------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన విద్వాంసుడు ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

నా అభిమాన సంగీత (విద్వాంసుడు) హీరో:

..............................................................................

..............................................................................

పాల్గొనేవారి పేరు: ..........................................................

వయసు:..............తరగతి: ..............................................

చిరునామా:..................................................................

..............................................................................

పిన్: ..........................  ఫోన్: ..........................

పాల్గొనేవారి సంతకం: ........................

తల్లి/తండ్రి సంతకం:.......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 మే 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

**హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-7**
**చందమామ ఇండియా లిమిటెడ్**
**82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ**
**ఈకాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097.**

సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు





వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# నేలతల్లిని కాపాడుకుందాం!

పుట్టినప్పటినుంచి గిట్టేవరకు తిండి, బట్ట, నీడ మొదలైన మనిషి అవసరాలన్నిటినీ సమకూర్చేది భూమి. మనిషి తన అవసరాల కోసం భూమిని రకరకాలుగా ఉపయోగించుకోవలసివస్తోంది. అలా ఉపయోగించుకోవడంవల్ల భూమికి కొంత హానికూడా జరుగుతోంది. సాగుభూములూ, పట్టణప్రాంతాలూ, పరిశ్రమలూ పెరిగేకొద్దీ చెట్టుచేమలు తరిగిపోయి, అటవీ సంపద హరించుకుపోతున్నది. భూగర్భజలాలకోసం పుడమితల్లికి ఒళ్ళంతా తూట్లు పడుతున్నాయి!

అందువల్ల, మన అవసరాలను తీర్చుకుంటూ భూమిని పరిరక్షించుకోవడం ఎలాగా అనే ఆలోచనలు మొదలయ్యాయి. వాటి పర్యవసానమే మొక్కలు నాటడం; వర్షపునీరు సేకరణ మొదలైన పథకాలు!

అయితే, ఇవాళ మన పబ్బం గడిస్తేచాలు; రేపు ఎవరికి ఏమైతేనేం? అనే విపరీత స్వార్థ మనస్తత్వం కారణంగా మనిషి నేలతల్లికి తీరని హాని కలిగిస్తున్నాడు. తత్ఫలితంగా సహజవనరుల కొరత; భూ, వాతావరణ కాలుష్యం, ఉత్పాతాలు తప్పవని విజ్ఞానవేత్తలు హెచ్చరిస్తున్నారు.

ఇవన్నీ చాలవని, ఇటీవల జీవాయుధాల అపాయం పడగ విప్పుతోంది. ఇలాంటి జీవాయుధాల వల్ల కేవలం మనుషులే కాకుండా, సర్వ ప్రాణికోటీ నాశనం కావడం తథ్యం. భూమీ, నీరూ కలుషితమైపోయి సర్వనాశనం తప్పదు!

ఈ భూమిమీద లక్షలాది సంవత్సరాలుగా మనిషి జీవిస్తున్నాడు. ఈ కాలంలో అసంఖ్యాకమైన జంతుజాతులు నశించిపోయాయి. మరెన్నో నశించిపోయే అపాయస్థితిలో ఉన్నాయి. అలాంటి దుస్థితి మానవజాతికి కూడా పట్టకుండా ఉండాలంటే 'భూగ్రహాన్ని' పరిరక్షించుకోవాలి. ఈ సత్యాన్ని గుర్తుచేయడం కోసమే యేటా ఏప్రిల్ 22 వ తేదీ భూ(రక్షణా) దినోత్సవం జరుపుకుంటున్నాం. ఈ సందర్భంగా నేలతల్లికి హాని తలపెట్టమని ప్రమాణం చేద్దాం!

అద్దెఇల్లు లాంటి భూప్రపంచంలో అడుగుపెట్టాం. దానిని కాపాడుకుంటూ హాయిగా జీవించి, మరింత భద్రంగా దానిని ముందుతరాలకు అప్పగించడం ప్రతి ఒక్కరి కర్తవ్యం!

సంపాదకుడు : విశ్వం





# ఏడిపించేవాడు

వికారుడనేవాడికి, వాళ్ళకూ వీళ్ళకూ లేనిపోని ఆశలుపెట్టి ఏడిపించడం సరదా. ఒకరోజున వాడు వీధిలో వెళుతూండగా, ఒక బిచ్చగాడు చెయ్యి చాపి, "దయగల మారాజువి.నాలుగు రాగిడబ్బు లిచ్చి నన్నాదుకో," అన్నాడు.

వికారుడు వాడివంకఎగాదిగా చూసి, "నువ్వు నన్ను మారాజువన్నావు కానీ, నీలో నిజంగా రాచ కళ ఉట్టిపడుతోంది. నేను చెప్పినట్లు చేశావంటే, నీ దరిద్రం తీరిపోతుంది. నా వెంట వస్తావా?" అని అడిగాడు.

బిచ్చగాడు సరేనన్నాడు. వికారుడు వాణ్ణి తనింటికి తీసుకువెళ్ళి మంచిబట్టలు కట్టబెట్టాడు. తర్వాతవాణ్ణితీసుకుని ఒకఇంటికివెళ్ళి, "ఈయన మారువేషంలోని మహారాజు. మీ కష్టాలు స్వయంగా విచారించాలని వచ్చారు," అని చెప్పాడు.

ఆ ఇంటివాళ్ళకుబోలెడు కష్టాలున్నాయి. ఎవరైనా వెయ్యి వరహాలు సాయంచేస్తే అవన్నీ తీరి పోతాయి. వాళ్ళావిషయం ఏకరువుపెడుతూంటే, వికారుడు మనసులో తెగ నవ్వుకుని పైకిమాత్రం, "రేపు ఉదయం ఊరి చివరవున్న పాడుబడ్డ సత్రా నికివస్తే, రాజుగారు మీక్కావలసిన డబ్బిస్తారు," అని చెప్పాడు.

అందుకా ఇంటివాళ్ళెంతో సంతోషించి, ఇద్ద రికీ తృప్తిగా మంచి భోజనం పెట్టారు.

అక్కడి నుంచి వికారుడు, బిచ్చగాణ్ణి మరొక ఇంటికి తీసుకెళ్ళాడు. ఇంటి యజమానిని రాజ భటులు అన్యాయంగా ఖైదు చేశారు. విడిపించ డానికి నూరువరహాలు లంచం అడుగుతున్నారు. అలా లంచం ఇవ్వడం నేరమని, ఆ ఇంటివాళ్ళు జంకుతున్నారు.

వికారుడు వాళ్ళను మొత్తం వివరాలన్నీ అడిగి, "విలువైన మీ ఇంటి నగ ఏదైనా రాజుగారికి ఇవ్వండి. ఇది లంచంగా ఇచ్చిన మీ ఇంటి నగ అని గుర్తులు చూపించి, భటుల లంచగొండి తనం రాజుగారు బయటపెడతారు. మీకు న్యాయం జరుగుతుంది; నగా తిరిగొస్తుంది. రేపు

ఉదయం ఊరి చివరవున్న పాడుబడ్డ సత్రానికి రండి,'' అన్నాడు.

ఇంకా ఆ ఊళ్ళో ఒకకవికి, తనకావ్యాన్ని రాజు కొలువులో చదివి వినిపించాలని వుంది. ఒక ముసలమ్మకు తన ఈడుదే అయిన రాజమాతను చూడాలనివుంది. ఇలా ఎందరో వున్నారు. అందర్నీ వికారుడు మర్నాడు ఉదయం పాడుబడ్డ సత్రానికి రమ్మన్నాడు.

అలా సాయంత్రమైంది. అప్పుడు వికారుడు, బిచ్చగాణ్ణి తన ఇంటికి తీసుకువెళ్ళి, తానిచ్చిన బట్టలు తిరిగి తీసుకున్నాడు. తర్వాత, వాడితో, ''పోయి మామూలుగా అడుక్కో!'' అన్నాడు.

''ఇంకా అడుక్కోవడమెందుకు? ఈ రోజుతో, నా దరిద్రం తీరిపోతుందన్నారుగా!'' అన్నాడు బిచ్చగాడు.

''అదా! ఇందాక ఊరందర్నీ ఏడిపించాను. వాళ్ళ కోర్కెలు తీరినట్లే నీవీ తీరుతాయి,'' అని హేళనగా నవ్వాడు వికారుడు.

''ఇలా అందర్నీ ఏడిపించడంవల్ల, మీకేమిటి లాభం?'' అని అడిగాడు బిచ్చగాడు.

''అందులో నాకానందముంది. రేపు ఉదయం ఊరిచివర పాడుబడ్డ సత్రానికి వెళితే బోలెడు వినోదం!'' అన్నాడు వికారుడు నవ్వుకుంటూ. బిచ్చగాడు గొణుక్కుంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం వికారుడు ఊరి చివర పాడుబడ్డ సత్రానికి వెళితే–అక్కడ నిజంగానే మహారాజు వున్నాడు! ఆయన ముందు రోజున వికారుడి ద్వారా ఇవ్వబడ్డ వాగ్దానాలన్నింటినీ నిలబెట్టుకున్నాడు. వచ్చినవాళ్ళాయనకు జయజయధ్వానాలు చేశారు.

అప్పటికి వికారుడికి అర్థమైంది--తాను నిన్న వీధిలో చూసిన బిచ్చగాడు, నిజంగానే మారువేషంలో వున్న మహారాజని! వాడు వెంటనే రాజు కాళ్ళమీదపడి, ''ప్రభూ! నా కారణంగానే ఊళ్ళో ఎందరికో మేలుజరిగింది. నన్నుకూడా కనికరించాలి,'' అన్నాడు.

''సరే! ఈ రోజునుంచీ నువ్వు, ఊరి మధ్యవున్న పాతకాలపు మట్టిగోడల ఇంట్లో బందీగావుంటావు. ఊళ్ళో ఎవరికే అవసరాలు వచ్చినా నీతో చెప్పుకుంటే, అవి నీద్వారానే తీరుతుంటాయి. నువ్వు మాత్రం ఎప్పటికీ బందీవి,'' అన్నాడు మహారాజు.

''ప్రభూ! నాకు ఇదేమి శిక్ష?'' అన్నాడు వికారుడు దీనంగా.

''ఏం చేసేది? నీవంటివాళ్ళను ఏడిపించడం నాకు సరదా!'' అన్నాడు మహారాజు.





# మాయాసరోవరం

## 3

[జయశీలుడు అపూర్వ సాహసం ప్రదర్శించి సేనాని కొడుకు మంగళవర్మను,పులులబారినుంచి కాపాడాడు. అమితానందం చెందిన కనకాక్షరాజు అతణ్ణి చాలా మెచ్చుకుని, మంత్రి సలహాపై, అతడికి ఉద్యోగం ఇచ్చాడు. మంత్రి, జయశీలుడికి రాజకార్యం గురించి చెపుతున్న సమయంలో, ఒకసేవకుడు విరిగిన కత్తినీ, ఒక ముత్యాలహారాన్నీ తీసుకుని అక్కడికి వచ్చాడు. -తరవాత]

కనకాక్షరాజూ, మంత్రి ధర్మమిత్రుడూ సేవకుడు తెచ్చిన విరిగినకత్తినీ, ముత్యాలహారాన్నీ చూసి చాలా ఆశ్చర్యం చెందారు. మంత్రి ముత్యాల హారాన్నిపరీక్షించి చూసి, "మహారాజా,ఈహారం యువరాణీదే అయివుంటుందా? అలాగే ఈ విరిగిన కత్తి యువరాజుదై ఉండదు కదా?" అన్నాడు.

రాజు వాటిని పరీక్షించి చూసి, "ఇవి యువ రాజూ, యువరాణీ అరణ్యంలో కనబడకుండా పోయిన చెట్టుదగ్గిర దొరికినవని చెప్పకపోతే, ఇవి వాళ్ళవే కావచ్చన్న అనుమానం కూడా నాక్కలిగేది కాదు," అన్నాడు.

"నిజమే, మహారాజా! యువరాణిగారి ప్రధాన చెలికత్తె మల్లికను పిలిపిస్తే, ఈ కత్తి మాటకేంగాని, కనీసం ముత్యాలహారాన్నయినా గుర్తించగలదు," అన్నాడు మంత్రి ధర్మ మిత్రుడు.

రాజు చెప్పగానే సేవకుల్లో ఒకడు వెళ్ళి, మల్లికను అక్కడికి తీసుకువచ్చాడు. మల్లిక తన యజమానురాలు కనబడకుండా పోయి



నందుకు దుఃఖంలో వున్నది. రాజు ఆమెకు ముత్యాలహారం ఎక్కడ దొరికిందో చెప్పకుండా, హారాన్ని ఆమె చేతికిచ్చి, "దీన్ని అంతఃపురం లోనివాళ్ళెవరో పారేసుకున్నారు. తీసుకుపోయి వాళ్ళకిచ్చెయ్యి," అన్నాడు.

మల్లిక ఆ హారంలోని ప్రతి ముత్యాన్నీ వేళ్ళతో తడివి చూస్తూ, ఒకచోట చప్పున ఆగి, "మహారాజా, ఈ హారం యువరాణిది! మేం అరణ్యంలో విహారానికి వెళ్ళినప్పుడు, ఆమె దీన్ని ధరించి వున్నది," అని చెప్పింది.

ఆ హారం తన కుమార్తెదే అని మల్లిక ధృవ పరచగానే, కనకాక్షరాజు మనస్సు చివుక్కు మన్నది. ఆయనమల్లికను ఏదో ప్రశ్నించబోయి కూడా, గొంతు పెగలక తలవంచుకు వూరు కున్నాడు.

రాజు స్థితి గమనించిన మంత్రి ధర్మ మిత్రుడు మల్లికను, "అమ్మాయీ, ఇలాంటి ముత్యాల హారాలను సంపన్నులైన గృహస్థుల యువతులెందరో ధరిస్తూంటారు. మరి ఈ హారం యువరాణిదే అని నమ్మకంగా ఎలా చెప్ప గలవు?" అని ప్రశ్నించాడు.

మల్లిక, మంత్రికి ఆ హారంలోని రెండు ముత్యాలను చూపుతూ, "చిట్లిన రెండు ముత్యాలనూ చూడండి! ఒకసారి యువ రాణికి నామీద కోపంవచ్చి, ఆ హారం తీసి నాకేసి విసిరింది. అది గురితప్పి ఒక చెట్టు బోదెకు తగిలింది. అప్పుడు ఈ రెండు ముత్యాలూ కొద్దిగ చిట్లినై," అన్నది.

మల్లిక జవాబుతో రాజుకూ, మంత్రికీ కూడా హారం యువరాణి కాంచనమాలదే అన్న నమ్మకం కలిగింది. అక్కడే దొరికిన కత్తి యువ రాజు కాంచనవర్మదే అన్నదాంట్లో ఎవరికీ అనుమానం కలగలేదు. రాజు మంత్రితో, "ఇంతకూ, ఈ వస్తువులు కనుక్కున్న బోయ వాడి మాటేమిటి?" అన్నాడు.

ఆ వెంటనే హారాన్నీ, కత్తినీ అరణ్యంనుంచి తెచ్చిన సేవకుడు మంత్రితో, "అయ్యా, ఆ బోయవాడు మనం అడిగినదానికి బుద్ధిగా జవాబు చెప్పేస్థితిలో లేడు. మాటిమాటికీ 'రెండుకాళ్ళ మొసలి!' అంటూ కేకలు పెడు తున్నాడు," అన్నాడు.

ఆ జవాబు వింటూనే సిద్ధసాధకుడు అదిరి పడి, "మహారాజా! మహాకాలుడి పరివారం లోని భూతగణాలు కొన్ని అప్పుడప్పుడూ చిత్ర విచిత్ర వేషాలతో మనుషులకు కనిపించ డంలోకప్రసిద్ధమే కదా! ఆ బోయవాడికి పట్టిన భూతాన్ని లొంగదీసి, వాడిచేత అన్ని వివరాలూ చెప్పించగలను. నాకూ, జయశీలుడికీ అరణ్యా నికి వెళ్ళేందుకు అనుమతివ్వండి!" అని కోరాడు.

ఇందుకు రాజు అనుమతించాడు.వెంటనే జయశీలుడూ, సిద్ధసాధకుడూ, రాజసేవకుణ్ణి వెంటబెట్టుకుని, అరణ్యంలోని పెద్ద ఊడల మఱ్ఱి దగ్గరకు చేరారు.

అప్పుడు ఆ ఊడలమఱ్ఱి దగ్గర కొందరు బోయవాళ్ళు పోగై ఉన్నారు. వాళ్ళమధ్య మతి పోయిన ఒక బోయవాణ్ణి పెడరెక్కలు విరిచి కట్టి, దయ్యాలపోతొకడు సాంబ్రాణి పొగ వేస్తూ, "హాం, హర్, హర్,ఫర్,ఫర్!" అంటూ కేకలు పెడుతున్నాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ, రాజ సేవ కుడూ, ఊడలమఱ్ఱి కిందికిపోయారు. సిద్ధ సాధకుడు, తన చేతిలోని పొన్నుకఱ్ఱను పైకెత్తి, దయ్యాలపోతును, "ఇకఆగు,ఆగు!" అన్నాడు. దయ్యాలపోతు, సాధకుడికేసి కోపంగా చూసి, అతడి మీదికి దూకబోయేసరికి, రాజసేవకుడు అడ్డుపడి, "ఓయ్, దయ్యాలపోతూ! ఈయన రాజుగారి ఆస్థాన మాంత్రికుడు," అన్నాడు.

సిద్ధసాధకుడు ఒకడుగు ముందుకు వేసి, "ఒరే, నీచగ్రహోపాసకపు వెధవా! నా మంత్ర శక్తితో నిన్ను గడ్డిపోచగా మార్చి, చిటికెనవేలికి చుట్టుకోగలను!" అన్నాడు.

దయ్యాలపోతు వణికిపోతూ చూడసాగాడు. సిద్ధసాధకుడు, పిచ్చిచూపులతో చుట్టూ కలయ చూస్తున్న బోయవాడితో, "ఒరే, బోయభీమన్నా! నిన్ను బెదరగొట్టిన రెండు కాళ్ళ మొసలిని, ఇదిగో, ఈ వీరయువకుడు జయశీలుడు గుండెల్లో కత్తి గుచ్చి చంపాడు. ఇకనీకు భయం లేదు, లేచి నిలబడు. జయశీలుడు మొసలి గుండెల్లో దించిన కత్తి చూడు," అంటూ జయశీలుడి కత్తిని తానే ఒరలో నుంచి లాగి చూపాడు.



బోయవాడు చప్పున లేచి నిలబడి, "దొరా, ఆ రెండుకాళ్ళ మొసలి పిశాచాన్ని చంపారా, దాని శవం ఎక్కడ?" అని అడిగాడు. సిద్ధసాధ కుడు ఏమాత్రం తొణక్కుండా, "ఒరే, లోకంలో మనిషి చచ్చి శవం అవుతాడు గాని, పిశాచం చచ్చి శవం కావడం జరుగుతుందా? సరే, ఆ ముత్యాలహారం, విరిగిన కత్తీ ఎక్కడ దొరికి నయ్యో చెప్పు!" అన్నాడు.

బోయవాడు ఒకసారి గొంతు సవరించు కుని, "దొరా, నేను గూడెం వదిలి వేటకు బయలుదేరాను. ఆ కనబడే మద్దిచెట్టు కొమ్మల్లోంచి అడవి కోడిపుంజు కూతవెయ్య డంవినిపించింది. దాన్ని బాణంతో కొట్టాను. అది దాని రెక్కలో గుచ్చుకున్నది. పుంజు పైకి లేచి, బాణం అడ్డుపడగా ఎగరలేక, దూరంగా వున్న రేగుపొదలో పడిపోయింది," అంటూ వాడు జయశీలుణ్ణీ, సిద్ధసాధకుణ్ణీ గుబు రుగావున్న ఒక రేగుపొద దగ్గరకు తీసుకు




జయశీలుడు పత్రాలను సాధకుడి నుంచి తీసుకుని, ఒకసారి పరిశీలనగా చూసి, ''వీటిని బోయవాడు చెప్పే, ఆ రెండుకాళ్ళ మొసలే ఇక్కడ పోగొట్టుకుని ఉండాలి!'' అన్నాడు.

''అంతే అయుంటుంది,'' అని సిద్ధసాధకుడు బోయవాడికేసి తిరిగి, ''రెండుకాళ్ళ మొసలి ఇక్కడికి ఎందుకు వచ్చాడు?'' అని ప్రశ్నించాడు.

''దొరా, నేను రేగుపొదలో పడ్డ అడవికోడిని బయటకు లాగేందుకు వంగాను. వెనక శబ్దమయింది. తల తిప్పిచూతునుగదా! ఒళ్ళంతా మొసలిలా గగ్గులు గగ్గులుగా ఉన్న ఆకారం కంటబడింది. నేను చావుకేకపెట్టి నేలమీద పడిపోయాను,'' అన్నాడు బోయవాడు.

తర్వాత జయశీలుడు, బోయవాడి భుజం తట్టి, ''ఒరే, అబ్బీ! నువ్వు బాణంతో కొట్టిన అడవికోడి ఏమయింది?'' అని అడిగాడు. బోయవాడు ఏదో జవాబు చెప్పబోయేంతలో, దయ్యాలపోతుపళ్ళుకొరుకుతూ, ''దాన్ని కొండ దేవత ఎత్తుకుపోయి ఉంటుంది! తెల్లవారు జామున కోడిపుంజును కొట్టి వీడు అపచారం చేశాడు,'' అన్నాడు.

జయశీలుడు వాడికేసి కోపంగా చూసి, సిద్ధసాధకుడితో, ''ఇక్కడ అంతా వెకిలి వెధవలు చేరినట్టుంది. మనం ఈ చుట్టుపక్కల ఉన్న కొండల్లో, లోయల్లో కనీసం ఒక వారం రోజులపాటైనా తిరిగి, ఆ రెండుకాళ్ళ మొసలి గాడి జాడలేమైనా తెలుసుకోగలమేమో చూద్దాం!'' అన్నాడు.

'' ఇది మంచి యోచన, జయశీలా!'' అంటూ సిద్ధసాధకుడు, జయశీలుణ్ణి మెచ్చుకుని, ''తాళపత్రగ్రంథాన్ని ఇక్కడ పోగొట్టు

పోయి, ''దొరా, ఈ పొదలోనే నాకు ముత్యాల హారం, విరిగిన కత్తీ దొరికెనై,'' అన్నాడు.

బోయవాడు మాట పూర్తిచేసే లోపలే, సిద్ధ సాధకుడు వంగి పొదలోకి చూస్తున్నవాడల్లా ఎగిరి గంతేసి, ''జయశీలా! మహారణ్యం మధ్యలోని ముళ్ళ రేగుపొదలో, పురాతన తాళపత్ర గ్రంథం! జై, మహాకాళా!'' అంటూ పొదలోంచి, ఒక చిన్న తాళపత్రాల కట్టను బైటికి లాగాడు.

ఆ తాళపత్రాలను చూసి, సిద్ధసాధకుడు అంతగా ఆవేశపడిపోవడం, జయశీలుడికి ఆశ్చర్యం కలిగించింది. సాధకుడు మాత్రం పత్రాలను ఒక్కొక్కదాన్నే తిప్పి చూస్తూ, ''ఇదెక్కడి భాష? ఏ లోకంవాళ్ళు మాట్లేడేది! పత్రాలు తాటి ఆకుల నుంచో, భూర్జపత్రాల నుంచో తయారుచేసినవి కావు. మందంగా వుండే తామర ఆకుల నుంచి కత్తిరించినట్టుగా ఉన్నది!'' అని గొణగసాగాడు.

కున్నవాడే యువరాజు, యువరాణుల్ని ఎత్తుకు పోయినవాడైతేమాత్రం—వాడు తప్పక రాక్షస జాతివాడో, యక్ష, కిన్నెర, కింపురుష, గంధర్వ జాతివాడో అయిఉంటాడు!'' అన్నాడు.

తర్వాత ఇద్దరూ కలిసి దాపులనున్న కొండల కేసి బయలుదేరారు. వాళ్ళ వెంట వచ్చిన రాజుగారి సేవకుడు వాళ్ళను, ''అయ్యా, నేనిక తిరిగి వెళతాను. రాజుగారికి ఏమని చెప్ప మన్నారు?'' అని అడిగాడు.

దానికి సిద్ధసాధకుడు, ''ఒరే, రాజుగారికి ఈ శుభవార్త చెప్పు! ఆయన పిల్లలు అపహ రించబడిన ఊడలమర్రి దగ్గర, ఒక మహో గ్రంథం దొరికిందనీ, దాని సాయంతో త్వరలోనే యువరాజూ, యువరాణులను ఎత్తుకుపోయిన దుష్టులను సంహరించి, వాళ్ళను క్షేమంగా రాజప్రాసాదానికి తేగలమనీ తెలియబరచు!'' అన్నాడు.

ఈ మాటలకు జయశీలుడు తనలో తాను నవ్వుకున్నాడు. తర్వాత, ఇద్దరూ దట్ట మైన చెట్లతో కప్పబడిన కొండప్రాంతం కేసి పోసాగారు. ఆ సమయంలో కొండ దిగువ నున్న ఒక కుగ్రామంలో, గ్రామస్థులంతా వీధుల్లో చేరి, భయకంపితులైపోతూ, ఏమి చేయడమా అని చర్చించుకుంటున్నారు.

ఈ గగ్గోలుకంతకూ కారణమైన సంఘ టన, ఆనాటి ఉదయాన, గ్రామానికి దాపుల నున్న జొన్నచేల దగ్గర జరిగింది. ఆ చేలల్లో ఒకచోట మంచె వున్నది. దానిమీద కూర్చుని జొన్నచేల కాపలా కాస్తున్న ఒక పద్నాలుగేళ్ళ కుర్రవాడికి, దూరంగా చేలకేసి వస్తున్న ఏనుగు ఒకటి కనిపించింది. ఏనుగును వడిశెల దెబ్బతో తరుమడం సాధ్యం కాదని వాడికి



తెలుసు. కాని, ఆ కాపు కుర్రవాడు వయసుకు మించిన ధైర్యశాలి. ఏనుగు జొన్న చేలల్లో పడకుండా ఏదో ఒకటి చేయాలి గనక-వాడు వడిశెలలో మంచి కరకురాయి ఒకటి పెట్టి, ఏనుగుకేసి గురిగా విసిరాడు.

రాయి జయ్‌మంటూ పోయి ఠపీమంటూ ఏనుగుకు తగిలింది. ఆ దెబ్బకు ఏనుగు ఘీంకరించడానికి బదులుగా, ఒక వింత ఆకారం ఏనుగు మీద లేచి కూర్చుని, ''అరే ఒరే! ఎవఁడా ఆ రాయి విసిరింది? నేనెవరను కున్నావు!'' అంటూ హుంకరించింది.

ఆ హుంకరింపుతో కాపు కుర్రాడి పై ప్రాణాలు పైనే పోయినంత జరిగింది. వాడు గడగడ వణికిపోతూ, మంచె నుంచి కిందికి దూకి పారిపోవాలనుకుంటూనే, కాళ్ళూ చేతులూ ఆడక, మంచెమీదనే స్థాణువులా నిలబడిపోయాడు. ఒకటి రెండు క్షణాల్లో ఏనుగు మంచెను సమీపించింది. ఆ ఏనుగు



మామూలు ఏనుగులా లేదు.దాని శరీరమంతా చేపల పొలుసులతో కప్పబడి ఉన్నట్టు ఉన్నది. దాని మీద కూర్చున్నవాడు తలకు,మొసలి తల ఆకారంలో వున్న శిరస్త్రాణం ధరించి ఉన్నాడు. వాడిశరీరాన్ని గగ్గులు గగ్గులుగా వున్న మొసలి చర్మం కప్పి ఉన్నది.

ఈ వికృతాకారుడు, కాపుకుర్రాణ్ణి సమీపించి, అభయం ఇస్తున్నవాడిలా చేఎత్తి, ''ఒరే, నీకొచ్చిన భయం ఏమీలేదు; నేచెప్పినట్టు చెయ్యి. నువ్వు గ్రామానికి పోయి నాకు మంచి ఆహారం తీసుకురా. దానితోపాటు మీ గ్రామంలో మంచి వైద్యుడుంటే, వాణ్ణికూడా వెంటబెట్టుకురా. బాగా శస్త్రచికిత్స తెలిసిన వాడైతే మేలు. ఇటు చూడు! డొక్కలో దిగి విరిగిపోయిన ఈ కత్తిని నేర్పుగా బయటికి లాగి, ప్రాణాపాయం కలక్కుండా కాపాడాలి. మీ ఇద్దరికీ గొప్ప ప్రతిఫలం ఉంటుంది!'' అన్నాడు కాస్త ఆయాసపడుతూ.

కాపుకుర్రాడు నిలువెల్లా వణికిపోతూ, ఆ వికృతాకారుడు చెప్పినదంతా విన్నాడు. కాని, వాడికి మంచె దిగడానికి ధైర్యం చాలలేదు. అది గ్రహించిన వికృతాకారుడు ముందుకు వచ్చి, కాపుకుర్రాణ్ణి నడుం పట్టుకుని పైకెత్తి, ఏనుగు మీదికి దించి, తర్వాత చేతులు రెండూ పట్టుకుని నేల మీదికి జార్చాడు.

కాళ్ళు రెండూ నేలను తాకగానే, కాపుకుర్రాడికి నూరు ఏనుగుల బలం వచ్చినట్టయింది. వాడు యమకింకరుడి పట్టునుంచి బయటపడినవాడిలా కీచుమంటూ ఒక కేక పెట్టి, సుడిగాలిలా జొన్నచేలకు అడ్డంపడి పరిగెత్తుతూ, కొద్దిసేపటికల్లా గ్రామం చేరాడు.

ఆ సమయంలో గ్రామ మధ్యంలోని వేప చెట్టుకింది రచ్చబండ మీద గ్రామస్థులు కొందరు కూర్చుని, పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. పరుగెత్తుకుంటూ వస్తున్న కుర్రాణ్ణి చూస్తూనే వాళ్ళు, జొన్నచేల మీదికి ఏ అడవి పందుల గుంపో, లేళ్ళ మందో వచ్చి పడివుంటుందనుకుని, ''ఒరే, చిన్నా! ఏం జరిగింది? ఎందుకలా పరిగెత్తుతున్నావు?'' అని అడిగారు.

చిన్నడు ఆగి రొప్పుతూ, తడబడే మాటల్తో జొన్నచేల దగ్గర జరిగిందంతా చెప్పాడు. గ్రామస్థుల్లో ఎవరికీ వాడి మాటల మీద నమ్మకం కలగలేదు. వాడికేదో మతిభ్రమ కలిగి ఉంటుందని కూడా కొందరనుకున్నారు. కాని, ఆ సమయంలో అక్కడికొచ్చిన గ్రామ గణాచారి, గ్రామపెద్ద ద్వారా సంగతంతా విని, ''చిన్నా చెప్పింది అంత అబ్బురమైనసంగతేం కాదు. నాకు అమ్మవారు పూనినప్పుడు ఇలాంటి నీటి ఏనుగుల్నీ, మొసలి

మనుషుల్నే కాదు-రెండు తలల సింహాలనూ, మూడు తలల పులులనూ, పది తలలు గల వింత మనుషుల్నీ కూడా చూస్తూ వుంటాను,'' అన్నాడు.

''అయితే, ఇప్పుడు మనం ఏం చేయడం? మనలందర్నీ చంపేందుకు, ఆ రాక్షసజాతి వాడు ఏదన్నా పన్నాగం పన్నాడేమో!'' అన్నాడు గ్రామపెద్ద.

అక్కడి నుంచి నలుగురూ గుమిగూడి, చర్చలూ, వాదులాటలూ ప్రారంభించారు. ''చూశారా, వాడి శరీరంలో ఏదో కత్తి దిగి వున్నది. వాడు ఆహారంతోపాటు వైద్య సహాయంకూడా కోరుతున్నాడు. మనం, మన చరకాచారిని వెంటబెట్టుకుపోవడం బావుంటుంది,''అని సలహా ఇచ్చాడొకడు, గుంపులో వున్న గ్రామవైద్యుడు చరకాచారిని చూపుతూ.

అది విని చరకాచారి భయంతో కంపించిపోతూ, ''వికృతాకార రాక్షసుడికి నేను వైద్యం చేయడమా? పైగా అది శస్త్రచికిత్స తెలిసిన వాడు చేయవలసిన పని. మన క్షౌరకుడు వీరనారాయుణ్ణి పిలిపించండి. వాడు రాక్షసుడి డొక్కలోంచి కత్తి లాగింతర్వాత, రక్తస్రావమై చావకుండా, నేను సంజీవనికి ఏమాత్రం తీసిపోని ఓషధులతో తయారుచేసిన మందులిచ్చి, వాణ్ణి కాపాడగలను,'' అన్నాడు.

వెంటనే ఇద్దరు పోయి, జనం వెనక దూరంగా నిలబడివున్న వీరనారాయుణ్ణి తీసుకువచ్చారు. వాడు గిలగిలలాడిపోతూ, ''ఆ మొసలి రాక్షసుడంతటివాణ్ణి తాకి, శస్త్రం చేసి కత్తిని బయటికి లాగేటంత శక్తి నాకున్నదనుకుంటున్నారా!''అంటూమతిపోయినవాడిలా గంతులు వేయసాగాడు.

జనంలోని ఇద్దరు దృఢకాయులు, వీరనారాయుణ్ణి వడిసి పట్టుకున్నారు. గ్రామ పెద్ద పెద్దగొంతుతో, ''వీడికి శస్త్రచికిత్సలో వున్న నేర్పరితనం మాట తర్వాత. ముందు అందరూ కదలండి. ఎందుకైనా మంచిది, ఆయుధాలను-కత్తీ, కర్రా, గొడ్డలీ, ఈటే, ఇలా ఏది అందితే దాన్ని చేతికి తీసుకోండి. ఇక చిన్నా చెప్పిన మాటల్లోని నిజానిజాలు జొన్నచేల దగ్గిర రుజువవాల్సిందే!'' అన్నాడు.

గ్రామస్థులు కర్రలూ, కత్తులూ, గొడ్డళ్ళూ పట్టుకుని తానున్న చోటుకు రావడం చూస్తూనే, ఏనుగు మీది వికృతాకారుడు దాన్ని అదిలించాడు. ఏనుగు తొండం ఎత్తి ఘీంకరిస్తూ, వాళ్ళకేసి దూకుతూ రాసాగింది.-(ఇంకావుంది)



# నీటిగండం

చోడవరం పెద్దగ్రామం. చుట్టూ మాగాణిభూములూ, కొంచెం దూరంలో పెద్ద కాలవా, గ్రామాన్నానుకుని ఒకచెరువూ ఉండేవి. గ్రామంలో చాలామంది పనిగట్టుకుని ఈతనేర్చుకునేవారు. అందువల్ల, ఎప్పుడైనా నిండుగా ప్రవహించేకాలవనుగానీ, వాగులనుగానీ దాటవలసివస్తే, నేర్చుకున్న ఈతపనికివస్తుందని, వాళ్ళ ఆలోచన.

గ్రామంలో చలమయ్య అనే నలభైఏళ్ళ రైతుండేవాడు. మనిషి ఆజానుబాహువు; ఆరడుగుల పొడవు. అతడికి ఈత ఏమాత్రం రాదు. ఎవరైనా ఈత నేర్చుకోమని సలహా ఇస్తే, "నాకు నీరంటే మహాభయం. ఆరడుగుల పొడవరిని. ఈ చుట్టుపక్కల ఎక్కడా, నేను మునిగి పోయేంత లోతున్న కాలవలూ, చెరువులూ ఏమీ లేవు," అంటూంటేవాడు ధీమాగా.

ఒకసారి అతడు పొద్దుగూకేవేళ పొలంనుంచి ఇంటికి వస్తున్నాడు. అది వానాకాలం. ఉరుములూ, మెరుపులూ. చలమయ్య చెరువుగట్టునే నడుస్తూ , కాలుజారి చెరువులో పడిపోయాడు. వెంటనే అతడు, "అయ్యో, నాకు ఈత రాదు. నీటిగండం తప్పదు!" అనుకుంటూ, మునగడం, అంతలోనే పైకి తేలడం ప్రారంభించాడు.

ఇలా ఒకనిమిషకాలం గడిచేసరికి, ఆ చావుభయంలో మెరుపులా ఒకసంగతిగుర్తుకొచ్చింది. చెరువు ఎంతో కాలంగా మేటవేసిపోయివున్నది. అందులో ఐదడుగులకు మించి నీరుండదు. ఈ సంగతి గుర్తు రాగానే చలమయ్య లేచి నిటారుగా నిలబడి, "నీటిగండం భయం ఉన్న కాస్త మతీ పోగొట్టిందే! ఇకనైనా తప్పక ఈతనేర్చుకోవాలి," అనుకుంటూ గట్టుకెక్కాడు.



బేతాళ కథలు

# రాజు వానప్రస్థం!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, నిర్మానుష్యమైన ఈ ప్రేత భూమిలో నువ్వు నిర్భయంగా సంచరించటం చూస్తూంటే, నీకేం కావాలో, నీ గమ్యమేమిటో అసలు నీకు తెలుసునా అన్న సందేహం కలుగుతున్నది. ఒక్కొక్కసారి సకల శాస్త్రపారంగతులూ, వివేకసంపన్నులూ కూడా, అగమ్యగోచరమైన స్థితిలో పడిపోతూంటారు. ఇందుకు ఉదాహరణగా,



సత్యకీర్తి అనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం వరాళిదేశాన్ని సత్యకీర్తి అనే మహారాజు పరిపాలించేవాడు. అతడు ధర్మాధర్మ విచక్షణాశీలిగా పేరుబడ్డాడు. ప్రజలు సర్వ సౌఖ్యాలూ అనుభవిస్తూ, శాంతియుత సహ జీవనం చేసేవారు. ఇలా కాలంగడిచి సత్యకీర్తి వృద్ధుడయ్యాడు. రాజ్యవిషయాల్లో ఆయ నకు ఆసక్తి సన్నగిల్లింది. శరీరం విశ్రాంతిని కోరుకోవటం ప్రారంభించింది. ఇదంతా గమ నించిన మహారాజు, తానిక రాజ్యవ్యవహారాల నుంచి నెమ్మదిగా తప్పుకోవటం ఉత్తమమని భావించాడు.

సత్యకీర్తికి నలుగురు కొడుకులు. నలు గురూ వీరులూ, విద్యావంతులూ, బుద్ధిమం తులే. అందుచేత అతడు మంత్రి సామంతు లతో యోచించి, పెద్దకొడుకు రామభద్రుడికి పట్టాభిషేకం చేసి రాజ్యపరిపాలనా బాధ్యత అప్పగించాడు.

మహారాణి అంతకు రెండు సంవత్సరాల క్రితమే స్వర్గస్థురాలవటం వల్ల, గృహస్థాశ్ర మంలో ఒంటరి అయిన సత్యకీర్తి, కాలక్షేపం కోసం వయోధర్మంగా పురాణేతిహాసాలనూ, భక్తి మార్గాన్నీ అనుసరించటం మంచిదని భావించాడు. అలా కొన్నాళ్ళు గడిచేసరికి సత్యకీర్తికి,తాను భక్తిమార్గంలో మనసును పూర్తిగా నిమగ్నం చెయ్యలేకపోతున్నాననే చింత బాధించటం ప్రారంభించింది. ఆయన బాగా ఆలోచించి, తాను గృహస్థజీవితానికి దూరమై, ఏ సాధుసన్యాసుల సాంగత్యంలోనో ఆశ్రమజీవితం గడపటం ముక్తికి దగ్గరిమార్గం అనుకున్నాడు. ఈ తన మనోగతాన్ని నిత్యం తన వద్దకు వచ్చి వెళుతున్న బృహస్పతిభట్టు అనే పండితుడికి వివరించి, ఆయన అభిప్రాయం అడిగాడు.

నడివయసు దాటిన బృహస్పతిభట్టు, సత్యకీర్తి ఆలోచన విని పరమానందం చెంది, ''దివ్యమైన ఆలోచన చేశారు, ప్రభూ! ప్రాపం చిక లంపటాలకు ఆమడదూరంలో వుండే సాధుసన్యాసుల సాంగత్యం, ఆధ్యాత్మికతకూ, జీవన్ముక్తికీ అసలు సిసలైన మార్గం,'' అన్నాడు.

సత్యకీర్తి కొద్దిసేపు మౌనంగా వుండి, ''నిజమే! కాని, పుట్టినదాదిగా ఆహారశయ్యాది సుఖా లకు అలవాటుపడిన జీవితం మాది. అందు చేత, కఠోరమైన ఆశ్రమజీవితాన్ని గడపగలనా అన్న సందేహం నన్ను పీడిస్తున్నది,'' అన్నాడు.

ఆ మాటలకు బృహస్పతిభట్టు చిన్నగా నవ్వి, ''అటువంటి భయం అనవసరం, ప్రభూ! మొదటి కొద్దిరోజులు కష్టంగా అని పించినా, తర్వాత తమకు అదే అలవాటవు తుందని, నా గట్టినమ్మకం,'' అన్నాడు.

భట్టు మాటలకు రాజు సాలోచనగా తల పంకించాడు. క్షణం ఆగి భట్టే తిరిగి మాట్లాడుతూ, "పోనీ, ఒక పని చెయ్యండి, ప్రభూ! మన రాజధానికి సమీపంలోనే వున్న చంపక వనంలో కార్తికేయుడనే సన్యాసి తపోదీక్షలో వున్నాడు. ముందుగా అక్కడికి వెళ్ళి కొన్నాళ్ళ పాటు వుండి చూడండి," అన్నాడు.

ఆ మాటలు రాజు సత్యకీర్తికి తృప్తి కలిగించాయి. ఆయన తన ప్రయాణానికి వెంటనే తగిన ఏర్పాట్లు చేసుకున్నాడు. తండ్రి ప్రయాణానికి, ఆయన కొడుకులు నలుగురూ మొదట అభ్యంతరం చెప్పినప్పటికీ, తనకే మాత్రం కష్టంగావున్నా వెంటనే తిరిగి వస్తానంటూ ఆయన నచ్చచెప్పటంతో చివరకు అంగీకరించారు.

సత్యకీర్తి ఒక భటుణ్ణీ, ఒక పరిచారికనూ మాత్రం వెంటతీసుకుని, చంపకవనం చేరుకునేసరికి, అక్కడ సన్యాసి కార్తికేయుడి కుటీరానికి కొద్దిదూరంలో, ఆయనకోసం పర్ణకుటీరం ఒకటి నిర్మించబడి వున్నది. అందులో మామూలు పట్టెమంచం మీద మెత్తటి పరుపు వేసిన పడక, దానిపక్కనే చిన్న బల్లమీద వివిధ ఫలజాతులూ, సాత్విక ఆహారపదార్థాలూ మొదలైనవి సిద్ధంగా వున్నవి. కుటీరంలో ఒక మూలగా వివిధ దేవతామూర్తుల చిత్రపటాలూ, చిత్రాసనమూ, రుద్రాక్షలతో కూర్చిన జపమాలా ఉన్నవి.

సత్యకీర్తి, ఇవన్నీ ఏర్పరచి వెళ్ళిన భటులనూ ఇప్పుడు తనకోసం వేచివున్న భటుణ్ణీ, పరిచారికనూ మెచ్చుకున్నాడు.

రాత్రి మరే ఆలోచన లేకుండా భుజించి విశ్రమించిన సత్యకీర్తి, మరునాటి ఉదయాన్నే కార్తికేయుడి దర్శనార్థం బైలుదేరాడు. ఆయన వెళ్ళేసరికి కార్తికేయుడు ఆవరణలోగల ఒక



చెట్టుకింద నిశ్చలంగా ధ్యానంలో కూర్చుని కనిపించాడు.

సత్యకీర్తి నిశ్శబ్దంగా నడిచివెళ్ళి కుటీరం ముందుగల అరుగుమీద కూర్చున్నాడు. నిమిషాలు గంటలై కాలంగడిచింది గాని, కార్తికేయుడు అణుమాత్రం కూడా కదలలేదు. సత్యకీర్తి నెమ్మదిగా లేచి, అటూఇటూ తిరుగుతూ పరిసరాలను పరికించటం ప్రారంభించాడు. కొంతసేపటికి వెనుక నుంచి, "రాజా!" అంటూ మృదుగంభీరమైన పిలుపు వినిపించింది.

సత్యకీర్తి ఉలికిపాటుగా తిరిగి చూసేసరికి, ఎదురుగా ప్రశాంత మందహాసంతో సన్యాసి కార్తికేయుడు నిలబడి కనిపించాడు. సత్యకీర్తి చప్పున తలవంచి అతడికి నమస్కరించాడు.

"సుఖీభవ!" అంటూ ఆశీర్వదించిన కార్తికేయుడు, "రా, అలా కూర్చుందాం!" అంటూ వెళ్ళి అరుగుమీద కూర్చుని, సత్యకీర్తికి తన



పక్కనే చోటు చూపించాడు. ఆయన కూర్చున్న తర్వాత చిరునవ్వు నవ్వుతూ, ''నీ భటులంతా వెళ్ళిపోయారా?'' అంటూ ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు సత్యకీర్తి కాస్త బిడియపడి, ''పర్ణకుటీరంలో నా సౌకర్యం కోసం అన్ని ఏర్పాట్లూ చేసి రాజధానికి తిరిగిపోయారు, స్వామీ! ఒక్క భటుడూ, పరిచారికా మాత్రం ఉన్నారు. నాకు, ఈ వానప్రస్థ జీవితం బాగా అలవడినాక వాళ్ళుకూడా వెళ్ళిపోతారు. మొదటినుంచీ సుఖాలకు అలవాటుపడిన జీవితాలు కదా మావి!'' అంటూ తన రాకలోని ఆంతర్యమంతా వివరంగా చెప్పుకొచ్చాడు.

రాజు చెప్పినదంతా శ్రద్ధగా విన్న కార్తికేయుడు, ''అయితే, నువ్విక్కడికి వచ్చి చాలా సేపయిందన్నమాట! ఇంతసేపూ ఏం చేశావు? విసుగు కలిగిందా?'' అని అడిగాడు.

సత్యకీర్తి సంకోచంగానే, ''కాస్త విసుగు కలిగింది, స్వామీ! లేచి, అలా చంపకవన పరిసరాలను పరికిస్తూ కొంతసేపు తిరిగేసరికి ఏవేవో ఆలోచనలు వచ్చినై,'' అన్నాడు. ''ఏమిటా ఆలోచనలు?'' అని అడిగాడు కార్తికేయుడు.

''స్వామీ! ఈ చంపకవనంలో ఫలవృక్షాలేకాక ఓషధీ విలువలున్న లతలూ, మొక్కలూ వున్నట్టు తోచింది. రాజవైద్యుడు భీష్మాచార్యుణ్ణి ఇక్కడికి పిలిపించి, అతడిద్వారా ఇక్కడ ఔషధాలకు పనికివచ్చే లతలూ, మొక్కలూ ఏపాటివున్నవో తెలుసుకోవాలనుకున్నా. అలాంటివి వుంటే-ప్రజల్లో రోగ నిరోధకశక్తీ, జవసత్వాలూ మరింత వృద్ధిచెందేలా రాజవైద్యుణ్ణి, ఏదైనా సరికొత్త ఔషధం తయారు చేయమని ఆదేశించాలనుకున్నాను!'' అన్నాడు సత్యకీర్తి.

అంతా విన్న కార్తికేయుడు గంభీరంగా, ''రాజా! నువ్వు అజ్ఞానివి కావు. నేను విన్న దాన్నిబట్టీ, నువ్వు సకల శాస్త్రపారంగతుడివి. కేవలం కళ్ళుమూసుకుని ధ్యానమో, తపమో చేస్తేనే ముక్తి లభిస్తుందని, అంత గుడ్డిగా విశ్వసిస్తున్నావా?'' అంటూ ప్రశ్నించాడు.

సత్యకీర్తి ఆ ప్రశ్నకు జవాబివ్వలేక మౌనంగా వుండిపోయాడు. అప్పుడు కార్తికేయుడు చిరునవ్వు నవ్వి, ''రాజా! నువ్వు వెంటనే రాజధానికి తిరిగి వెళ్ళిపో. హాయిగా జీవిస్తూ, వాన ప్రస్థంలోనూ, తపస్సులోనూ పడదలచుకున్న శ్రమను, రాజుగా నీ అభిరుచి ప్రకారం వినియోగించు. చంపకవనం గురించిన నీ ఆలోచన ఎంతగానో మెచ్చదగింది! వెళ్ళిరా,'' అన్నాడు.

సత్యకీర్తి మారుమాట్లాడకుండా లేచి, కార్తికేయుడి పాదాలు తాకి నమస్కరించి వచ్చేశాడు. ఆ మర్నాడే ఆయన రాజధానికి తిరుగు ప్రయాణమయ్యాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, సత్యకీర్తిని, సకలశాస్త్ర పారంగతుడివి అన్న సన్యాసి కార్తికే

యుడు, ఆయనకు వానప్రస్థానికీ, తపస్సుకూ అవసరమైన జ్ఞానోపదేశం చేయడానికి బదులు, తిరిగి రాజధానికి వెళ్ళిపొమ్మని ఆదేశించటం న్యాయసమ్మతంగా వున్నట్లు కనబడదు. సర్వ సంగపరిత్యాగులై, ఏ వనాల్లోనో ఆధ్యాత్మిక చింతనతో తపస్సుచేసుకునే యోగులకూ, సన్యాసులకూ స్వాభావికమైన అహంకారంకొద్దీ కార్తికేయుడు అలా అన్నప్పటికీ, రాజు సత్యకీర్తి అయినా అతడిని ప్రాథేయపడి వుండిపోక, వెళ్ళిన రెండవ రోజునే రాజధానికి తిరిగి బయలుదేరడం అవివేకమైన పని కాదా? ఇక, ఆయనకు వానప్రస్థం, తపస్సులద్వారా ముక్తి లభించటం కల్ల కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మానవసేవే మాధవసేవ అనేది, తిరుగులేని ఆర్యోక్తి! సత్యకీర్తి ఎంతకాలం నుంచో, ఆ రకమైన మాధవ సేవ చేస్తూనేవున్నాడు. అయితే, వృద్ధాప్యంవల్ల పరిపాలనా బాధ్యతల నుంచి వైదొలగినఆయన, కేవలం వానప్రస్థ జీవితం గురించీ, తపస్సు గురించీ ఆలోచించటం ప్రారంభించాడు. వీటి వల్ల మాత్రమే ముక్తి లభిస్తుందనుకోవటం సత్యకీర్తి అజ్ఞానం. దాన్నే కార్తికేయుడు ఎత్తి చూపాడు. ప్రతి మనిషీ వృత్తి-ప్రవృత్తుల సమ్మిశ్రమం. రాజు ప్రవృత్తిరీత్యా ప్రజల బాగు, క్షేమంకోరే ధర్మశీలి. ఆ కారణం వల్లనే, ఆయన కార్తికేయుడి ఆశ్రమం చేరినా, చంపకవనంలో లభించే ఓషధీలతలా, మొక్కల గురించే ఆలోచించటం ప్రారంభించాడు. పైగా, సుఖభోగాలకూ, సేవకుల పరిచర్యలకూ అలవాటుపడిన ఆయన, వెంట ఇద్దరు పరిచారకులను తీసుకు వెళ్ళటం కూడా జరిగింది. సన్యసించటం, సర్వ సంగపరిత్యాగం, తపస్సు- ఇలాంటివి అంచెలవారిగా మనిషి చేయగలగటం అసంభవం. ఇవన్నీ గమనించే కార్తికేయుడు, సత్యకీర్తిని తిరిగి రాజ్యపాలనా విషయాలు చూసుకోమని ఆదేశించాడు. సూక్ష్మగ్రాహి అయిన సత్యకీర్తి, సన్యాసి చెప్పినదానిలోని ఆంతర్యం గ్రహించి, తన తాత్కాలిక వైరాగ్యభావాలను వదిలి, తన కర్తవ్యాన్ని నిర్వహించడానికి తిరిగి రాజధాని చేరాడు. అంతేగాని, ఇందులో సన్యాసి కార్తికేయుడి అహంకారం గానీ, రాజు సత్యకీర్తి అజ్ఞానం గానీ ఏమీ లేదు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: లక్ష్మిగాయత్రి రచన]



# మనదేశం గురించి తెలుసుకుందాం

- క్విజ్

1. ఒలింపిక్ క్రీడల 400 మీ. పరుగుపందెంలో మిల్కాసింగ్ ప్రపంచరికార్డు సృష్టించాడు. అది ఏ సంవత్సరం, ఎక్కడ జరిగిన ఒలింపిక్స్‌లోనో చెప్పగలరా?
2. 1900 వ. సం.లో ఐడా స్కడ్డర్, దక్షిణ భారతదేశంలోని చిన్నపట్టణంలో ఒంటిగది క్లినిక్ ప్రారంభించారు. అది ఇవాళ ప్రపంచప్రసిద్ధిపొందిన సంస్థగా ఉంటోంది. దాని పేరేమిటి?
3. గత సంవత్సరం భారతీయ సంతతికి చెందిన వి. ఎస్. నైపాల్ నోబెల్ సాహిత్యబహుమతి పొందారు. 1971 లో ఆయన బూకర్ బహుమతి అందుకున్నారు. ఆయన రచించిన ఏఏ గ్రంథాలు ఆయనకు ఆ బహుమతులు తెచ్చిపెట్టాయి?
4. జె.ఆర్.డి. టాటా విమానంలో బొంబాయి చేరుకోవడంతో 1932 వ. సం. భారత ఉపఖండంలో 'కమర్షియల్ ఫ్లైట్' ఆరంభమయింది. ఆయన ఎక్కడినుంచి బయలుదేరాడో తెలుసా?
5. నాసిక్‌లోని ఒక నదీతీరంతో సహా మనదేశంలో నాలుగు ప్రదేశాలలో మహాకుంభమేళా జరుగుతుంది. నాసిక్‌లో ఏ నదీతీరంలోనో చెప్పగలరా?
6. 1977 లో ఐక్యరాజ్యసమితి సామాన్య సభలో ప్రప్రథమంగా హిందీభాషలో ఉపన్యసించిన వారెవరో తెలుసా?
7. ప్రస్తుతం మన జాతీయ మృగం రాయల్ బెంగాల్ టైగర్ (పెద్దపులి). ఇంతకుపూర్వం ఆ ప్రత్యేకత మరొక మృగానికి ఉండేది. అది ఏమిటో తెలుసా?
8. భారతదేశం 1982 లో మొట్టమొదటిసారిగా అంటార్కిటికాలో తన స్థావరాన్ని ఏర్పరచుకున్నది. ఆ స్థావరం పేరేమిటి?
9. రొనాల్డ్ రాస్ మలేరియా క్రిములను గుర్తించినప్పుడు భారతదేశంలోని ఒక ఆస్పత్రిలో పనిచేసేవారు. ఏ ఆస్పత్రిలోనో తెలుసా?
10. గత 200 సంవత్సరాలలో మొట్టమొదటిసారిగా 1991 వ. సం. లో భారతదేశంలో అగ్నిపర్వతం ఒకటి ప్రజ్వరిల్లింది. అది ఎక్కడ జరిగిందో తెలుసా? (సమాధానాలు వచ్చే సంచికలో)

## మార్చ్ క్విజ్ సమాధానాలు:

1. మునులు.
2. పార్వతి, గిరిజ.
3. గౌతమ ముని; భార్య అహల్య; శ్రీరాముడు
4. ఐరావతం.
5. ఉగ్రసేనుడు.
6. కర్కోటకుడు.
7. గాంధారి. హస్తినాపురి రాజు. ధృతరాష్ట్రుడి భార్య.
8. దండకారణ్యం.

## 27. పంచతంత్ర కథలు



"అంటే, బృహత్కథ ప్రపంచంలోనే మొట్ట మొదటి కథాసంకలనం అన్నది మీ అభిప్రాయం. అంతేకదా తాతయ్యా?" అని అడిగింది శ్యామల దేవనాథుణ్ణి ఉత్సాహంగా.

"అవును,తల్లీ!" అన్నాడు దేవనాధుడు.

శ్యామల చేతిలోని పత్రిక పుటలు తిప్పి, అందులోని ఒకవ్యాసాన్ని తాతయ్యకు చూపింది. మరొక ప్రాచీనగ్రంథమైన 'పంచతంత్రం' గురించిన వ్యాసం అది. ఆ వ్యాస రచయిత పంచతంత్రమే భారతదేశంలో రచింపబడిన మొట్టమొదటి కథాసంకలనంగా పేర్కొన్నాడు.

"బృహత్కథ ప్రపంచంలోనేమొట్టమొదటి కథాసంకలనం అయినప్పుడు భారతదేశంలో కూడా అదే మొదటి సంకలనం అవుతుంది. అవునా! మరి పంచతంత్రం మనదేశంలోని మొట్టమొదటి కథాసంకలనం అంటున్నాడీ వ్యాస రచయిత. మరి అదేకదా ప్రపంచంలోని మొట్టమొదటి కథాసంకలనం కావాలి?" అని అడిగింది శ్యామల.

"అవును, శ్యామలా! ఈ వ్యాసరచయిత అభిప్రాయం కూడా కొంతవరకు నిజమే. గుణాఢ్యుడి బృహత్కథ పంచతంత్రం కన్నా, ప్రాచీనమైనదిగా భావించబడినప్పటికీ, అది మానవజాతి పోగొట్టుకున్న మహత్తర సాహితీ సంపద! మనం ఇప్పుడు చదువుతూన్న 'కథా సరిత్సాగరం' అందులో ఒక భాగం మాత్రమే.

విశ్వావసు



దీనిని 11వ శతాబ్దంలో సోమదేవుడు రచించాడు. అయితే పంచతంత్రం, 3వ శతాబ్దంలోనో అంతకుపూర్వమో రచింపబడింది,'' అన్నాడు దేవనాథుడు.

''సందీపుడు టీ తెస్తున్నాడు. టీ తీసుకున్నాక మిగిలిన సంగతులు చెబుదురు లెండి,'' అన్నది శ్యామల.

''అదేం ఫరవాలేదు. నెమ్మదిగా రానీ. తొందరేం లేదు,'' అన్న దేవనాథుడు మళ్ళీ, ''నేనన్నట్టు, కథాసరిత్సాగరం, పంచతంత్రం ఈ రెంటిలో ఏది మొదటిది అన్న విషయంలో పెద్ద వివాదం అవసరంలేదు. రెండూ మొదటివే: కథాసరిత్సాగరం తొలి కథాసంకలనం. పంచతంత్రం తొలికల్పిత నీతి కథాసంకలనం!'' అని కొంతసేపు ఆగి, ''అయినా, విష్ణుశర్మ మహానుభావుడు! ఆయన ఎంత పెద్ద సమస్యను స్వీకరించి దానిని ఎంతవిజయవంతంగా పరిష్కరించాడో తెలుసా?'' అన్నాడు.

''సమస్యా! అదేమిటి తాతయ్యా? బృహత్కథ ఎలా రచింపబడిందో చెప్పారు. అలాగే పంచతంత్రం రచనవెనకఉన్న కథను కూడా చెప్పండి, తాతయ్యా!'' అంటూ టీ కప్పుతో గదిలోకి వచ్చాడు సందీపుడు.

''ఆసక్తికరమైన కథే ఉంది,'' అంటూ టీ కప్పును అందుకున్న దేవనాథుడు ఇలా చెప్పసాగాడు:

మహిళారూప్యమనే రాజ్యాన్ని అమరశక్తి అనే రాజు పరిపాలించేవాడు. రాజ్య ప్రజలకు ఎలాంటి లోటూ లేదుగానీ, తన ముగ్గురు కుమారుల ప్రవర్తన కారణంగా రాజు మాత్రం తీరని విచారానికి లోనయ్యాడు. అలా అని రాకుమారులు దుష్టులూ, దుర్మార్గులూ కారు. కాని దేన్నయినా నేర్చుకోవాలంటే పరమ బద్ధకం. చదువంటే విముఖత. గురువులను చూస్తేనే గిట్టేదికాదు! వాళ్ళను మంచిమార్గంలో పెట్టడానికి రాజు ఎన్నోవిధాలుగా ప్రయత్నించాడు. అయినా, ఆయన ప్రయత్నాలన్నీ బూడిదలోపోసిన పన్నీరయింది.

తన తదనంతరం తన ముగ్గురు కొడుకులలో ఒకడు రాజ్యసింహాసనాన్ని అధిష్ఠించాలి. అయినా విద్యాగంధం లేనివాడికి రాజ్యాన్నెలా కట్టబెట్టడం? అన్న విచారంతో రాజు రాజ్యంలోని పండితులనూ, విద్యావేత్తలనూ సమావేశపరచి తన సమస్యను చెప్పి, ''నా పిల్లలను విద్యావంతులను చేసే మార్గం సూచించండి,'' అని కోరాడు.

పండితులు రకరకాల సలహాలిచ్చారు. అయినా రాజుకు అవి ఏవీ ఉపయుక్తంగా ఉన్నట్టు తోచలేదు. విషాదవదనంతో ఉన్న రాజును చూసి, ఒక పండితుడు చివరకు, ''ఎలాంటి జటిలసమస్యకైనా చక్కని పరిష్కార

మార్గం చూపే విష్ణుశర్మను సంప్రదించండి,'' అని సలహా ఇచ్చాడు.

రాజు ఆహ్వానం అందుకొని విష్ణుశర్మ రాజ భవనానికి వచ్చాడు. ఆయన వాక్చాతుర్యానికీ, జ్ఞానానికీ రాజు ముగ్ధుడయ్యాడు. తన సమస్యను చెప్పాడు. రాజకుమారులకు విద్యాబుద్ధులు నేర్పి, వారిని విద్యావంతులనూ, వివేకసంపన్నులనూ చేసే బాధ్యతను విష్ణుశర్మ స్వీకరించాడు. రాజు విష్ణుశర్మకు ధనం ఇవ్వచూపాడు. కాని విష్ణుశర్మ, ''రాజా! నేను విద్యను అమ్మబోను! పైగా నేను వృద్ధుణ్ణి. ఇకపై నాకెందుకు ధనం?'' అని దానిని సున్నితంగా తిరస్కరించాడు.

ఆ తరవాత రాకుమారులతో స్నేహంగా మాట్లాడుతూ, రాజప్రాసాదం మీది ఏకాంత ప్రదేశానికి తీసుకువెళ్ళాడు. అక్కడ దాపుల నున్న మర్రిచెట్టు నీడ పడుతోంది. ఆ చల్లని నీడలో నలుగురూ కూర్చున్నారు. ''గోదావరీ నదీతీరంలోని ఒక బ్రహ్మాండమైన బూరుగు చెట్టుమీద దశదిశల నుంచీ, రకరకాల పక్షులు వచ్చి నివసించేవి!'' అంటూ కథ చెప్పడం ప్రారంభించాడు విష్ణుశర్మ.

ఆ తరవాత ఆయన కథ తరవాత కథ చెప్పసాగాడు. మనుషులలోని మంచిచెడ్డలు, నమ్మకం-నమ్మకద్రోహం, వివేకం-అవివేకం, అదృష్ట-దురదృష్టాలు, నేరాలూ-శిక్షలూ, అమాయకులూ-మోసగాళ్ళూ ఇలా ఒకటే మిటి? రకరకాల మనస్తత్వాల గురించి ఎన్నో కథలు చెప్పాడు. ఒక కథలో మరికొన్ని ఉప కథలు, చిన్న కథలు విలక్షణమైన ప్రాచీన భారతీయ బాణీలో కథనం సాగింది. ఈ కథా కథనశైలి ఉత్తరోత్తరా అరేబియన్ నైట్స్‌లో అనుకరించబడింది.



విష్ణుశర్మ కొన్ని నెలలపాటు ఇలా కథలు చెప్పాడు. కథలన్నీ ఉత్సాహంగా వినడంతో, రాకుమారులు వివేకవంతులుగా మారారు. విష్ణుశర్మ తమకు వినోదం కోసం కథలేవో చెబుతున్నాడని భావించారుగాని, ఆయన వాటిద్వారానే ఎన్నో విషయాలు బోధించాడు. రాజకుమారులు నేర్చుకోవలసిన రాజనీతి, దౌత్యనీతి, మనస్తత్వం, లోకవ్యవహారం గురించిన వివిధ విషయాలు ఆ కథల ద్వారా వివరించాడు. పంచతంత్రం అంటే అయిదు విభాగాల జ్ఞానం అని అర్థం!

దేవనాథుడు ఇంతవరకు చెప్పి ఆగాడు. వెంటనే శ్యామల, ''తాతయ్యా! ఆ గొప్ప పుస్తకం నుంచి కనీసం ఒక్క కథ అయినా చెప్పు,'' అని అడిగింది కుతూహలంగా.

''పంచతంత్ర కథలు మీకు చాలామటుకు తెలిసే ఉంటాయి తల్లీ! నిద్రిస్తూన్న తన యజమాని నుదుటిపై వాలిన ఈగను తోలే

ప్రయత్నంలో యజమానినే చంపేసిన కోతి కథ మీకు తెలియదా? రెండు హంసలు ఆకాశ మార్గాన తీసుకువెళుతూన్న కర్రను కరుచు కునివున్న తాబేలు, అనవసరంగా నోరు తెరిచి మాట్లాడి ప్రాణాలు పోగొట్టుకున్న వైనం మీకు తెలుసుకదా? అదేవిధంగా సింహం బారినుంచి తమను కాపాడుకోవడం ఎలాగో తెలియకుండానే, చనిపోయిన సింహానికి ప్రాణం పోసిన ముగ్గురు మిత్రుల కథ కూడా మీకు తెలిసిందే కదా?'' అన్నాడు దేవనాధుడు.

''తెలుసుగాని, అవన్నీ పంచతంత్ర కథలేనా?'' అని అడిగాడు సందీపుడు.

''అవును. సరే, అందులో నుంచి చాలా చిన్నకథ ఒకటి చెబుతాను. కథ చిన్నదే అయినా అందులోని సందేశం చాలా గొప్పది. ప్రస్తుతపరిస్థితుల్లో మరీ విలువైనదని చెప్పాలి. రెండుతలల పాములు, దూడలు; అప్పుడ ప్పుడూ పిల్లలు కూడా పుట్టారని పత్రికలలో చదువుతూ ఉంటారు కదా! పంచతంత్రంలో రెండుతలల పక్షి కథ ఒకటి ఉంది. ఆ పక్షి ఒకే శరీరానికి రెండు తలలు. రెండు తలలు రెండు దిక్కులకేసి చూస్తూంటాయి. అంటే ఒకటి ఉత్తరంకేసి చూస్తూంటే రెండవది దక్షిణం కేసి చూస్తూ ఉంటుంది. ఒక రోజు ఒకతల శంఖంలో ఉన్న అమృతాన్ని చూసింది. రెండవ తల తనకూ అందులో భాగం కావా లన్నది. అయితే మొదటి తల ఇవ్వలేదు. అంతే, రెండవ తలకు విషం కనిపించడంతో వెంటనే తాగేసింది. రెండు తలలూ ఒకే శరీరానికి చెందినవి కావడంతో రెండు తలల పక్షి చచ్చిపోయింది!'' అని చెప్పి దేవనాధుడు పిల్లలకేసి భావగర్భితంగా చూశాడు.

''మాకు అర్థమయింది తాతయ్యా! మానవజాతి సమస్తం ఒకే ఒక భూప్రపంచా నికి చెందినది. భూమి మీది ఏ ఒక్క దేశం అనాలోచితంగా దుందుడుకు చర్యకు పాల్ప డినా, అది భూమికంతటికీ ఘోరాపాయంగా పరిణమిస్తుంది. అదీ ప్రస్తుత పరిస్థితి!'' అన్నాడు సందీపుడు.

ప్రొఫెసర్ దేవనాధుడు ఆ మాటకు తృప్తిగా నవ్వాడు. - (ఇంకావుంది)



మన పండుగలు

# నూతన సంవత్సర వేడుకలు

వసంత ఋతువుతోపాటు వచ్చే ఏప్రిల్‌నెలకు మనదేశంలో ఒక ప్రత్యేకత ఉంది. మనదేశంలోని వివిధ ప్రాంతాలలో అప్పుడే నూతన సంవత్సరం ఆరంభమవుతుంది. ఆ సమయంలోనే కొన్ని ప్రాంతాలలో పంట నూర్పిడి పండుగ కూడా జరుపుకుంటారు.

## బైసాఖి

పంజాబీలకు ఏప్రిల్ 13 (అరుదుగా 14) న వచ్చే బైసాఖి నూతన సంవత్సరారంభాన్ని సూచిస్తుంది. దీనిని నూర్పిడి పండుగ గానూ జరుపుకుంటారు.

రబీ పంట నూర్పిడికి సిద్ధమవుతుంది. బంగారంలాంటి ధాన్యంతో పచ్చటి పొలాలు ఎటు తిరిగినా కనులపండుగ చేస్తుంది. సిరులు పొంగే సమయం అది. సహజంగానే పల్లెసీమల ప్రజల మనసులు ఆనందంతో నిండి ఉంటాయి. అందుకే ఆటపాటలతో ఉల్లాసంగా పండుగ జరుపుకుంటారు.

బైసాఖి ఒక సామూహిక పర్వదినం. అదే దాని ప్రత్యేకత. స్త్రీ పురుషులు కలిసి ఉత్సాహంతో ఉరకలువేస్తూ భాంగ్రా, గిద్దా నృత్యాలు చేస్తారు.



ఈ పండుగకు ప్రత్యేకంగా రంగురంగుల సంప్రదాయ దుస్తులను ధరిస్తారు. మామూలుగా ఈ సామూహిక ఉత్సవాలు నదీతీరా లలో జరుగుతాయి. తాజా గోధుమ పిండితో తయారుచేసిన రొట్టెలను నెయ్యి, బెల్లంతో కలిపి తింటారు. మొత్తం మీద విందు భోజనాలతో, ఆటపాటలతో సాగే సంబరం ఇది. పెద్ద మంటను రగిలించి చుట్టూ నాట్యం చేస్తారు.

శిక్కులకు బైసాఖి ఖల్సా ఉద్యమ ఆరంభాన్ని కూడా సూచిస్తుంది. పదవ శిక్కు గురువు గురుగోవింద్ సింగ్ 1699 లో బైసాఖినాడే శిక్కు సౌభ్రాతృత్వాన్ని చాటే ఖల్సా ఉద్యమాన్ని ప్రారంభించాడు.

# గుడిపాడ్వా

మహారాష్ట్ర ప్రజలకు గుడిపాడ్వా నూతన సంవత్సరారంభం. చైత్రమాసం మొదటి రోజున దీనిని జరుపుకుంటారు. దీనిని సూర్పిడిపంటగానూ జరుపుకోవడం సంప్రదాయంగా వస్తోంది. నూతన కార్యాలను ఆరంభించడానికి శుభతరుణంగా దీనిని భావిస్తారు.

ప్రజలు తమ వాకిళ్ళలో ఆరోజు విజయానికి సంకేతమైన 'గుడిని' ప్రతిష్ఠిస్తారు. ఒక కలశం లేదా కుండను ఒక స్తంభం మీద బోర్లించడాన్ని 'గుడి' అంటారు. కలశానికి పట్టుబట్టను చుట్టి పసుపురంగు పూలతో, మామిడాకులతో అలంకరిస్తారు. ఈ 'గుడి' అరిష్టాలను తొలగించి; అదృష్టాన్నీ, సంపదలనూ కలిగిస్తుందని విశ్వసిస్తారు. దీనిని ఒక ప్రకృతి పూజగా కూడా భావిస్తారు.



గుడిని సూర్యోదయ సమయంలో ప్రతిష్ఠించి, సూర్యాస్తమ యందాకా ఉంచుతారు.

నూతనవస్త్రాలు ధరించి, విందు వినోదాలలో పాల్గొంటారు. వాకిళ్ళను రంగు రంగుల ముగ్గులతో అలంకరిస్తారు. ఉదయం పరకడుపున వేపచిగురు, కొత్త చింత పండు, బెల్లం కలిపి తయారు చేసిన మిశ్రమాన్ని తింటారు. ఇదిరక్తాన్ని శుద్ధి చేస్తుందని విశ్వసిస్తారు.

ఈ రోజునే రామచంద్రుడు వానరరాజు వాలిని హతమార్చినట్టు మహారాష్ట్రులు చెబుతారు. మహావిష్ణువు వేదాలనూ తద్వారా లోకాలనూ, రక్షించడానికి మత్స్యావతారం ఎత్తినదానికి గుర్తుగానే ఈ పర్వదినం ఏర్పడినట్టు మరికొందరు విశ్వసిస్తారు.

# నవవర్ష

బైసాఖ్ మాసం తొలిరోజును బెంగాలీలు అమితోత్సాహంతో నూతన సంవత్సరాదిగా జరుపుకుంటారు. దీనిని పొలియా బైసాఖ్ అని కూడా అంటారు. వాకిళ్ళలో ఆకర్షణీయమైన ముగ్గులు, పవిత్ర జలంతో నింపి, కొబ్బరికాయ ఉంచి మామిడాకులతో అలంకరించిన కలశం, తీపి తినుబండారాలూ ఈ పండుగ ప్రధాన అంశాలు.

# రొంగాలీ బిహు

అస్సామీ ప్రజల కొత్తసంవత్సరం రొంగాలీ బిహు ఏప్రిల్ మధ్యన వస్తుంది. దీనిని నూతన వ్యవసాయ సంవత్సరంగానూ భావిస్తారు. ఇప్పుడే నాట్లు ఆరంభమవుతాయి. దీనిని బొహాగ్ బిహు అనికూడా అంటారు. యేటా అస్సామీలు జరుపుకునే పండుగలన్నిటిలోకీ ఇది చాలా ఉత్తేజభరితమైనది.



ఈ పండుగ ప్రధాన ఆకర్షణ ఆటపాటలు, ఆనందోత్సాహాలు. సంప్రదాయ సామూహిక సమావేశాలలో అమ్మాయిలూ, అబ్బాయిలూ బిహూగీత్స్ అనే జానపద గీతాలకు అనుగుణంగా సుప్రసిద్ధమైన బిహూ నాట్యం చేస్తారు. ఈ ఆటపాటలకు ఢోల్, మద్దెల, గేదె కొమ్ములతో తయారుచేసిన 'పెపా' అనే వాయిద్యాలు నేపథ్య సంగీతాన్ని సమకూరుస్తాయి.

# విషు



మలయాళ నూతన సంవత్సరారంభాన్ని **విషూ** అంటారు. మలయాళమొదటి మాసం మేషం తొలిరోజు విషు. విషుకనిని చూడడం ఈరోజు ప్రత్యేక సంప్రదాయం.

సంపదను సూచించే మంగళకరమైన పచ్చిబియ్యం, కొత్తబట్టలు, బంగారం, దోసకాయ, తమలపాకులు, వక్కలు, అద్దం, పసుపురంగు రేలుపువ్వులు, పవిత్ర గ్రంథాలు, నాణాలు మొదలైనవాటిని గంటాకారంలోని 'ఉరుళి' అనే లోహపు పాత్రలో పెడతారు. దీనినే 'కని' అంటారు. విషూకు ముందు రోజు రాత్రి కుటుంబంలోని వృద్ధ స్త్రీ వీటిని అమరుస్తుంది. ఉదయం లేచి మొదట దానిని దర్శించినవారికి ఆ సంవ

త్సరం సకల సంపదలు కలుగుతాయని నమ్ముతారు.

ఈ సందర్భంగా 'కొడివస్త్రం' అంటే నూతన వస్త్రాలు ధరిస్తారు. కుటుంబంలోని పెద్దలు, నమస్కరించే పిన్నలకు నాణాలు, మధురభక్షణాలు ఇచ్చి ఆశీర్వదిస్తారు. దీనిని 'విషుకైనీటం' అని అంటారు. పిల్లలు దీనిని ఎక్కువగా ఇష్టపడతారు. దీవెనలతో పాటు కానుకల కోసం పెద్దల దగ్గరికి వెళతారు. అలా చేర్చిపెట్టిన డబ్బును 'విషువేలా' ఉత్సవంలో ఖర్చుపెట్టి తమకు ఇష్టమైన వాటిని కొనుక్కుంటారు. అది ఆనందోత్సవ సమయం!



# పుత్తాండు

తమిళులు చిత్తిరైమాసం తొలిరోజును నూతన సంవత్సరారంభంగా జరుపుకుంటారు. మామూలుగా ఇది ఏప్రిల్ 14న వస్తుంది. పుత్తాండు అంటే కొత్త సంవత్సరం అని అర్థం. దీనిని వరుషపిరప్పు అంటే సంవత్సరారంభం అని కూడా అంటారు.

కొన్ని ప్రాంతాలలో 'కన్ని' అనే శుభ దర్శనంతో రోజును ఆరంభిస్తారు. బంగారం, వెండి, కాయగూరలు, తమలపాకులు, వక్కలు, పువ్వులు, పచ్చిబియ్యం, కొబ్బరికాయ మొదలైనవాటిని ఒకచోట ఉంచు

తారు. దీనినే 'కన్ని' అంటారు. సంవత్స రాదిరోజున దానిని దర్శిస్తే సంవత్సరమంతా సంపదలూ, అదృష్టమూ లభిస్తాయని ఒక నమ్మకం.

ఈ రోజు ప్రజలు దేవాలయాలకు వెళ తారు. ఒకరికొకరు శుభాకాంక్షలు తెలియ జేసుకుంటారు. సాయంకాలం తమ భవిష్య త్తును తెలిపే 'పంచాంగ శ్రవణం' చేస్తారు.

మధ్యాన్నం భోజనంతో మామిడికాయం, వేపపువ్వు, బెల్లం కలిపి చేసిన 'మాంగాయ్ పచ్చడి' తీసుకుంటారు. తీపి, చేదు, వగరు లను జీవితంలో ఎదురయ్యే అనుభవాలకు సంకేతంగా చెబుతారు.

ఇళ్ళముందు పిండి ముగ్గులు పెడతారు. పచ్చటి మామిడాకులతో ద్వార తోరణాలు కడతారు.

# ఉగాది

ఆంధ్ర, కర్నాటక ప్రాంతాలలో కొత్త సంవ త్సరాదిని ఉగాది అని అంటారు. చైత్ర శుద్ధ పంచమితో తెలుగు కొత్తసంవత్సరం ఆరంభ మవుతుంది. వసంతఋతు ఆగమనాన్ని ఇది సూచిస్తుంది. కొత్త చిగుళ్ళతో ప్రకృతి నూతన శోభను సంతరించుకుంటుంది.

యుగానికి ఆది యుగాది. అదే క్రమేణా ఉగాది అయింది. సృష్టికర్త అయిన బ్రహ్మ ఈరోజే లోకసృష్టిని ప్రారంభించాడని పురాణాలు పేర్కొంటున్నాయి. ఆవిధంగా అది యుగాది అయిందని చెబుతారు. నూతనంగా వృత్తి వ్యాపారాలు ప్రారంభించడానికి దీనిని శుభ ప్రదంగా భావిస్తారు.

ఇల్లూ వాకిలీ శుభ్రపరచి, ద్వారాలను మామిడి తోరణాలతో అలంకరిస్తారు. కొత్త బట్టలు కట్టుకుని దేవాలయాలకు వెళతారు. సాయంకాలం పంచాంగ శ్రవణం చేస్తారు.



కొత్తబెల్లం, కొత్తచింతపండు, పచ్చిమిరప కాయలు, వేపపువ్వులు, మామిడి పిందెలు కలిపి ఉగాదిపచ్చడి చేయడం ఈనాటి ప్రత్యేకత. జీవితంలో ఎదురయ్యే రకరకాల అనుభవా లకు ఈ షడ్రుచులు సంకేతం. ఈ సుఖదుఃఖాలు మనకేవీ అంటకుండా ఉండాలన్న ఆశయంతో అందులో నెయ్యిని కలపడం విశేషం!

# హాస్యచతురులు : బీర్బల్



అక్బర్ చక్రవర్తి ప్రజల సంక్షేమం కోసం ఎన్నో సంస్కరణలను అమలుచేశాడు. అయినా, ఆయనను కొంతకాలంగా ఒక అనుమానం పీడించసాగింది. తన ప్రజలలో నిజంగానే నిజాయితీపరులు ఎంతమంది? అన్నదే ఆ అనుమానం. తన అనుమానాన్ని ఆయన ఒకనాడు బీర్బల్ దగ్గర వ్యక్తం చేశాడు.

బీర్బల్ కొంతసేపు తీవ్రంగా ఆలోచించిన తరవాత, "అదెంతపని? సులభంగా కనుగొనవచ్చు షాహెన్‌షా! 'పేద ప్రజలకు విందు ఏర్పాటు చేస్తున్నాం. అందువల్ల ఇంటికి ఒక చిన్న కడివెడు పాలు ఇవ్వాలి!' అని మొదట ఒక చాటింపు వేయించండి," అన్నాడు.





"అయినా, దానిద్వారా ఎవరు నిజాయితీపరులు, ఎవరు కారు అన్న విషయం ఎలా తెలుస్తుంది?" అని అడిగాడు చక్రవర్తి అనుమానంగా. "ప్రభూ! దయచేసి నేను చెప్పినట్టు చాటింపు వేయించండి. సమాధానం దానంతట అదే వస్తుంది," అన్నాడు బీర్బల్.

"ఫలానారోజు రాజభవనం ముందు పెద్ద పాత్ర ఉంచబడుతుంది. ఇంటికొకరు వచ్చి కడివెడు పాలు అందులో పోయాలి," అని చాటింపు వేయించమని రాజు ఆజ్ఞాపించాడు. చాటింపు జరిగింది.





ఆ రోజు, రానే వచ్చింది. ప్రజలందరూ కడవలతో రాజభవనం ముందు వరుసలు వరుసలుగా నిలబడి, కొద్దిగా ఎత్తులో పెట్టబడిన పెద్ద పాత్ర లోకి పాలు కుమ్మరించి వెళ్ళారు.



చివరివాడు కూడా పోసిన తరవాత, భటులు ఆ పాత్రమీద మూతపెట్టి, జాగ్రత్తగా కిందికి దించారు. ఆ తరవాత దానిని అక్బర్ చక్రవర్తి, బీర్బల్, మరికొందరు ప్రముఖులు కూర్చున్న చోటికి మోసుకువెళ్ళారు.



బీర్బల్ అక్బర్ చక్రవర్తికేసి చూశాడు. అక్బర్ చక్రవర్తి అంగీకార సూచకంగా తల ఊపిన తరవాత, బీర్బల్ భటులను ఆ పెద్దపాత్ర మూత తొలగించి, అందులో ఉన్న దానిని ఒక పెద్ద గరిటలోకి తీసుకుని అక్కడున్న వాళ్ళందరికీ చూపమన్నాడు.



"నీళ్ళు!" అని ఆశ్చర్యపోయాడు అక్బర్ చక్రవర్తి. "అవును, ప్రభూ! మంచినీళ్ళలాగే మన ప్రజల నిజాయితీ కూడా చాలా తేటతెల్లం!" అన్నాడు బీర్బల్.

# గాలిపటాలు!

ఎగిరేదేమో ఆకాశంలో. కానీ, దాన్ని నియంత్రించేది నేలపై నుంచి. అదేమిటో తెలుసా? చాలా సులభం. గాలిపటం! గాలి పటం ప్రియులందరికీ తెలుసు దానికికట్టే నూలుదారం మామూలు దారంకాదని. మెత్తటి గాజుపొడి కలిపిన మైదాపిండి గంజిని దారానికి పట్టిస్తారు. అందుకే అది తెగకుండా అంత దృఢంగా ఉంటుంది.

1800 వ సంవత్సరాలలో జైపూర్ మహారాజా రెండవ సవాయ్ రాంసింగ్ తన మిత్రులతో కలిసి రాజభవనం పైనుంచి గాలిపటం ఎగురవేసేవాడని చెబుతారు. అలా ఒకనాడు ఎగురవేస్తున్నప్పుడు వాళ్ళకూ వేరొక గాలిపటానికీ గట్టిపోటీ వచ్చిందట. కొంతసేపటికి అవతలిగాలిపటం రాజావారి గాలిపటాన్ని తెంచివేసింది.

దాంతో ఆశ్చర్యం చెందిన రాజా, ఆ గాలి పటం ఎవరిదో ఆరాతీశాడు. అది కుండలుచేసే చూడామణీ, కాలూరాం అనే ఇద్దరుఅన్నదమ్ములదనీ, నూలు దారంతెగకుండా దృఢంగా ఉండడానికి వాళ్ళు గాజుపొడి కలిపిన గంజి మిశ్రమాన్ని పూసే పద్ధతిని కనుగొన్నారనీ తెలియవచ్చింది. ఇకపై మీరు, మీ గాలి పటంతో అవతలివాళ్ళగాలిపటాన్ని తెంచినప్పుడు–చూడామణీ, కాలూరాంసోదరులకు కృతజ్ఞతలు చెప్పడం మరిచిపోరుకదూ!

# మహిళా అర్చకులు!

ఒరిస్సాలోని ఈ దేవాలయం చాలా భిన్నమైనది. దానికి కారణం ఇక్కడి ఎత్తయిన గోపురం, అద్భుతమైన ఆలయ విగ్రహం మొదలైనవేవీ కావు. ఇక్కడ అర్చకులందరూ స్త్రీలే.



అదీ ఇక్కడి విశేషం. ఒరిస్సా సముద్రతీర కేంద్రపారా జిల్లా సత్యాభయాలో ఉన్న పంచు బారాహీదేవాలయంలో దాదాపు 1300 సంవత్సరాలుగా మహిళలే పూజలు జరుపుతున్నారు. పురుష అర్చకులను ఆలయ గర్భగృహంలోకి అనుమతించడం లేదు. 'దాలీ' అనే స్థానిక పల్లెకారుల కుటుంబాలకు చెందిన స్త్రీలే ఆలయంలో పూజాది కార్యక్రమాలను నిర్వహిస్తారు.

# 'సంప్రదాయ చిత్రకళ'





సుద్దముక్క, పెన్సిల్ దొరికితే చాలు; పసిపిల్లలు గోడలపై బొమ్మలు గీయడం మొదలెడతారు. పెద్దలు కోప్పడతారు. అయితే, పసిపిల్లలు ఇప్పుడు చేస్తున్న పనినే అతి ప్రాచీనులైన మన పూర్వులు చేసేవారు.

మధ్యప్రదేశ్ భోపాల్ సమీపంలోని వింధ్యపర్వత సానువులలో భీమ్‌బేక్తా గుహాలయాలు ఉన్నాయి. ఈ గుహాలయాల కుడ్యాలపై రకరకాల వర్ణచిత్రాలు కనిపిస్తాయి. ఇవి దాదాపు 10,000 సంవత్సరాలనాటివని చరిత్రకారులు చెబుతారు.

ఆనాటి నిత్యజీవితంలోని వేట, తేనె సేకరణ, ముసుగు నాట్యాలు,జంతువుల యుద్ధం, స్వారీ చేయడం మొదలైన దృశ్యాలూ; రకరకాల ఆయుధాలూ చిత్రించబడి ఉన్నాయి. అడవి పందులు, ఎలుగుబంట్లు, జింకలు, సింహాలు, పులులు, కుక్కలు మొదలైన జంతువుల చిత్రాలు కూడా ఉన్నాయి. ఈ చిత్రాలు చాలా వరకు ఎరుపు, తెలుపు రంగులలో ఉన్నా, అక్కడక్కడ ఆకుపచ్చ, పసుపు రంగులు కూడా కనిపిస్తాయి.

# 'మల్-స్తంభ'

మనదేశం కొన్ని ప్రాంతాలలో 12వ శతాబ్దంలో 'మల్-స్తంభ' అనే ఒక వింత క్రీడ ఆడేవారు. ఇది ఒక రకమైన మల్లయుద్ధం. అయితే, మల్లయుద్ధవీరులు నేలపై నిలబడి యుద్ధం చేసేవారు కాదు. రెండవ స్థానంలో వచ్చిన మల్లయుద్ధ వీరుల భుజాలపై కూర్చుని యుద్ధం చేసేవారు.



వాళ్ళను అంతటితో వదిలి పెట్టేవారనుకున్నారా? కాదు. వాళ్ళను మొలలోతు నీళ్ళల్లో నిలబెట్టి, వాళ్ళ భుజాల పైకి ఎక్కి మరీ యుద్ధం చేసేవారు. చూపరులకు వినోదంగా ఉన్నా రెండవ స్థానం వచ్చినవారి పాట్లు ఎలా ఉండేవో ఒక్కసారి ఊహించుకోండి!

# కర్నాటక జానపద కథ

కర్నాటక రాష్ట్రం దక్కను పీఠభూమి పశ్చిమదిశలో దాదాపు 1,92,000 చ.కి.మీ. వైశాల్యంలో విస్తరించి ఉంది. తూర్పున ఆంధ్రప్రదేశ్, ఉత్తరదిశలో మహారాష్ట్ర, దక్షిణదిశలో తమిళనాడు, కేరళరాష్ట్రాలను సరిహద్దులుగా కలిగి ఉంది. భారత భూభాగంలో పదహారు శాతం విస్తరించి ఉన్న కర్నాటక రాష్ట్రం జనాభా ఐదు కోట్లా ఇరవై లక్షలు. కన్నడం మాతృ భాషగాగల కర్నాటక ప్రజలను కన్నడిగులు అంటారు. నల్లటి నేల (కరినాడు) కలిగిన దేశం గనక దీనికి కరినాడు-కర్నాటక అనే పేరు వచ్చిందని కొందరంటారు. 'కరునాడు' అంటే అందమైన దేశం. 'కరునాడు' కర్నాటకగా రూపాంతరం చెందింది అని మరికొందరి అభిప్రాయం.

భారతదేశంలో ఇవాళ 'సైన్స్ సిటీ'గా పేరుతెచ్చుకున్న బెంగుళూరు-కర్నాటక రాజధాని. మనదేశంలోని ఎక్కువభాగం ఎలక్ట్రానిక్ పరిశ్రమలు ఇక్కడే కేంద్రీకృతం కావడంవల్ల బెంగుళూరును 'ఎలక్ట్రానిక్స్ నగరం' అని కూడా అంటారు. ఆసియా ఖండంలోనే అమితవేగంగా అభివృద్ధిచెందుతూన్న నగరం ఇది!

# మల్లెల యువరాణి!

పడమటి కనుమలలో ఒక కొండపై చిన్న నీటి బుగ్గగా పుట్టే కావేరీనది—మల్లెలూ, గులాబీలూ గుబాళించే అడవులూ; పచ్చటి పొలాలూ, సుందర ఉద్యానవనాలగుండా ప్రవహిస్తోంది. ఒకానొకప్పుడు ఆ ప్రాంతాన్ని ఒకరాజు పరిపాలించేవాడు. ఉన్నట్టుండి ఆ రాజ్యంలో పాముల బెడద ఎక్కువయింది. ప్రజలు భయభ్రాంతులయ్యారు. రాజుకు ఏం చెయ్యాలో తోచలేదు. ఆయనకు అందగాడూ, బుద్ధిమంతుడూ అయిన ఒక కొడుకు ఉన్నాడు. అతడు పాముల



బెడదను రూపుమాపుతానని తండ్రి అనుమతితో అడవికి బయలుదేరాడు. అడవిలో కనిపించిన పాములన్నిటినీ చంపసాగాడు.



ఒకనాడు అలా చాలాసేపు పాముల వేట సాగించిన రాకుమారుడు, అలిసిపోయి ఒక పెద్ద చెట్టు కింద కూర్చుని అలాగే నిద్రపోయాడు. అతడి వెంటవచ్చిన అంగరక్షకులు అతనికి కాపలా కాస్తున్నారు. అప్పుడు ఆ చెట్టు కొమ్మలపై నుంచి ఏడు తలల సర్పం ఒకటి మెల్లగా దిగి రాజకుమారుణ్ణిసమీపించింది. రాజకుమారుడికి కాపలా కాస్తున్న రక్షకభటులు దానిని నరకడానికి కత్తులు దూశారు. అయితే అప్పుడే కళ్ళు తెరిచిన రాకుమారుడు పచ్చగా మెరిసే ఆ సర్పం కళ్ళల్లోకి చూశాడు. వెంటనే అతడు, "ఆగండి! ఆ ఉన్నత ప్రాణిని చంపకండి! దాని కళ్ళనిండా విషాదం నిండివుంది. ఏదో చెప్పాలనుకుంటున్నది!" అన్నాడు.

భటులు అలాగే ఆగిపోయారు. ఆ తరవాత రాకుమారుడు సర్పంకేసి తిరిగి, "నీకు నేనేం సాయంచేయాలో చెప్పు, చేస్తాను," అన్నాడు ఆప్యాయంగా.

"యువరాజా! గత ఏడేళ్ళుగా తీరని శిరోవేదనతో బాధపడుతున్నాను. భయంకరమైన ఆ తలనొప్పి కారణంగా ఈ రాజ్యంలోని పాములకు రాజుగా వుండికూడా వాటి ని సక్రమంగా అదుపు చేయలేకపోతున్నాను. ఈ విషయంలో నాకు నీ సాయం కావాలి," అన్నది పాము దీనంగా.

"నేను, ఏం చేయాలో చెప్పు," అని అడిగాడు రాకుమారుడు.

"మీ రాజ్యానికి దక్షిణంగా ఏడు యోజనాల దూరంలో వేరొక రాజ్యం ఉంది. ఆ రాజ్యాన్నేలే రాజుకు చాలా సుకుమారి అయిన కూతురు ఉంది. ఆమె ఏడుమల్లెల బరువే ఉంటుంది. ఆ మల్లెల యువరాణి ఇంతవరకు నవ్వి ఎరుగదు. ఆమె నవ్వితే ఆమె నోటినుంచి మూడు మల్లె పువ్వులు రాలుతాయి. వాటిలో రెండవదాన్ని నేను వాసన చూస్తే నా తలనొప్పి మాయమైపోతుంది. నువ్వు నాకా పువ్వును తెచ్చి ఇచ్చావంటే, రాజ్యంలో పాముల బెడద లేకుండా చేస్తాను," అన్నది సర్పం.

రాకుమారుడు ఇప్పుడే వెళ్ళి మల్లెల యువరాణిని చూసి, పువ్వులతో తిరిగి వస్తానని సర్పానికి చెప్పాడు. ఈ సంగతిని తన తల్లితండ్రులకు చెప్పమని భటులద్వారా వర్తమానం పంపి, తాను దక్షిణ దిశగా బయలుదేరాడు.

మార్గమధ్యంలో అతనికి ఒక పెద్దసరస్సు కనిపించింది. సరస్సులో నీళ్ళు చాలా నిర్మలంగా ఉన్నాయి. దప్పిక తీర్చుకుందామని

## చరిత్ర

చంద్రగుప్త మౌర్యుడి కాలం నుంచే అంటే క్రీ.పూ. 300 సం. నుంచి మనదేశ చరిత్రలో కర్నాటక ప్రస్తావించబడి ఉంది. చంద్రగుప్త మౌర్య చక్రవర్తి, అవసానదశలో రాజ్యాన్ని త్యజించి జైనమతాన్ని అవలంబించి, కర్నాటకలోని శ్రావణ బెళగొళకు చేరాడని చెబుతారు. కొన్ని శతాబ్దాల అనంతరం శ్రావణ బెళగొళలోనే 17 మీటర్ల ఎత్తయిన గోమతేశ్వర విగ్రహం ప్రతిష్ఠించబడింది.



అతడు నీళ్ళకేసి వంగాడు. అప్పుడు అతనికి ఒక చీమల తుట్టె నీళ్ళపై తేలడం కనిపించింది. "అయ్యో, పాపం!" అనుకుంటూ అతడు తన తలపాగాను విప్పి,తుట్టెకింద ఉంచి దానిని నీళ్ళల్లో నుంచి అలాగే గట్టు మీదికి తెచ్చి వదిలాడు.

"కృతజ్ఞతలు రాకుమారా! నీ పరోపకార బుద్ధి మెచ్చుకోతగింది. మునుముందు మా అవసరం కలిగితే మమ్మల్ని తలుచుకో. వచ్చి సాయపడగలం," అన్నవి చీమలు ఒక్కసారిగా సన్నటి స్వరంతో.

సరేనని రాకుమారుడు దప్పిక తీర్చుకుని ముందుకు సాగాడు. అతడు చాలాదూరం వెళ్ళాక ఒకచోట పెద్ద మూలుగు వినిపించింది. రాకుమారుడు ఆ దిశకేసి వెళ్ళాడు. అక్కడ రాక్షసుడొకడు బ్రహ్మాండమైన చింత చెట్టుచేత నేలకు గుది గుచ్చబడి ఉన్నాడు. బహుశా ఆ రాక్షసుడు నోరు తెరుచుకుని నిద్రపోతున్నప్పుడు, ఏదో కాకి చింతగింజను వాడి నోట్లో జార్చి ఉంటుంది. ఆ గింజ మొలిచి, పెరిగి పెద్దదై వృక్షమై ఉంటుంది. రాక్షసుడు చాలా కాలానికి నిద్రలేచి చూసే సరికి, చింత మాను వేళ్ళు కొన్ని వాడి శరీరం గుండా నేలలోకి చొచ్చుకొని పోయాయి. అందువల్లనే ఆ రాక్షసుడు, నేలకు అతుక్కు పోయి, పైకి లేవలేక అటూ ఇటూ కదలలేక మూలుగుతూ



రోదిస్తున్నాడు. రాకుమారుడు తన పదునైన కత్తితో, చింతచెట్టు వేళ్ళను తెగ నరికాడు. రాక్షసుడు సంతోషంగా లేచి కూర్చున్నాడు.

''నువ్వేగనక ఇటు రాకుండా ఉంటే నాగతి ఏమై ఉండేదో ఊహించుకుంటేనే భయంగా ఉంది. నీ మేలు ఈ జన్మలో మరువను. ముందు ముందు నీకేదైనా అపాయమో, అవసరమో ఏర్పడితే, నన్ను తలుచుకో. ఆ క్షణమే నీ ముందు వాలి సాయపడతాను,'' అన్నాడు రాక్షసుడు కృతజ్ఞతాభావంతో.

రాకుమారుడు అక్కడి నుంచి బయలు దేరి, ఎలాంటి అవాంతరాలూ లేకుండా పొరుగు రాజ్యం పొలిమేరను చేరుకున్నాడు. ఆ తరవాత రాజధానీనగరం చేరి, ఒక పెద్దసత్రంలో బసచేసి, తాను ఉత్తరంగా ఉన్న రాజ్యానికి యువరాజు ననీ, మల్లెల యువరాణిని వివాహమాడడానికి వచ్చాననీ, రాజుకు వర్తమానం పంపాడు. అంద గాడూ, బుద్ధిమంతుడూ, సాహసవీరుడూ అయిన పొరుగురాజ్యం రాకుమారుడు తన కుమార్తెను వివాహమాడవచ్చాడని తెలియగానే రాజు ఆనం దంతో స్వయంగా వెళ్ళి, రాకుమారుడికి స్వాగతం పలికి తన భవనానికి తీసుకుపోయాడు.

''మా కుమార్తెకు తగిన వరుడివే నువ్వు. అయినా, మా కుటుంబంలో ఒక ఆచారం ఉంది. యువరాణిని వివాహమాడాలంటే మూడు పరీక్ష లలో నెగ్గాలి. అవి నీకు అల్పమైన పనులుగా కనిపించవచ్చు. అయినా వాటిని జయప్రదంగా ముగిస్తేనే యువరాణి పాణిగ్రహణం సాధ్యమవు తుంది,'' అన్నాడు రాజు.

''ఆ మూడు పరీక్షలేమిటో చెప్పండి మరి,'' అన్నాడు రాకుమారుడు.

''ఒక ధాన్యపుకొట్టు నిండుగా బియ్యమూ, మినుములూ కలిసిపోయి ఉన్నాయి. ఒక రాత్రి లోపల బియ్యం వేరుగా, మినుములు వేరుగా చేయాలి. దీనిని పూర్తిచేశాక రెండవ పరీక్ష ఏమిటో చెబుతాను,'' అన్నాడు రాజు.

రాజకుమారుడు ధాన్యాగారం దగ్గరికి వెళ్ళాడు. దాని నిండుగా బియ్యమూ, మినుములూ కలిసిపోయి ఉన్నాయి. వాటిని ఎలా విడదీయడమా అని ఆలోచిస్తూ ఉంటే అతనికి ఉన్నట్టుండి దారిలో కనిపించిన చీమలు జ్ఞాపకం

## పువ్వులు-వాసన ద్రవ్యాలు



కూర్గ్, చిక్‌మగళూర్‌లలో పండించే కాఫీ కారణంగా కర్నాటక చాలా ప్రసిద్ధి గాంచింది. ప్రపంచంలోనే శ్రేష్ఠమైన 'పోకచెక్క' ఉత్పత్తి చేయడంలో షిమోగా అగ్రస్థానంలో ఉంది.

సంపంగి, మల్లెలు మొదలైన పరిమళ భరితమైన పుష్పాలకూ; గంధపు చెట్టు, టేకు, పనస మొదలైన విలువైన వృక్షా లకూ కర్నాటక పేరుగాంచింది.

ఏలకులు, మిరియాలు లాంటి వాసనద్రవ్యాలు ఇక్కడి మల్నాడు అడ వుల్లో విరివిగా పండుతాయి.

వచ్చాయి. మరుక్షణమే అతడిముందు చీమల దండు ప్రత్యక్షమయింది. రాకుమారుడు చెప్పక ముందే అవి బియ్యాన్నీ, మినుములనూ వేరు చేయడానికి యుద్ధప్రాతిపదికలో పూనుకు న్నాయి. అర్ధరాత్రికల్లా బియ్యం ఒకరాసిగానూ, మినుములు వేరొక రాసిగానూ ఏర్పడ్డాయి.

రాకుమారుడు ఏంచేశాడో చూడడానికి, తెల్లవారాక రాజు అక్కడికి వచ్చాడు. అక్కడున్న రెండు రాసులను చూసి సంతోషంగా, "బావుంది! మొదటి పరీక్షలో నెగ్గావు. ఇప్పుడు వంద సోలల వరి అన్నాన్ని వంద మానికల మజ్జిగతో కలిపి తినే యాలి! సరేనా?" అంటూ, రాజు క్షణాలలో అన్నం, మజ్జిగ తెప్పించి అక్కడ ఉంచి వెళ్ళిపోయాడు.

రాకుమారుడు ఇప్పుడు రాక్షసుణ్ణి స్మరించ గానే వాడు, అతడి ముందు ప్రత్యక్షమై వంగి నమస్కరించాడు. రాజకుమారుడు సంగతి చెప్పగానే, రాక్షసుడు అన్నాన్ని మింగేసి, మజ్జిగను గటగటా తాగేసి తన పెద్దపెద్ద పెద వులు చప్పరిస్తూ, రాజకుమారుడికి ప్రత్యుప కారంచేయగలిగానన్న సంతోషంతో నిలబడ్డాడు.

అప్పుడు రాజు, తన మూడవ పరీక్ష ఏమిటో రాకుమారుడికి చెప్పాడు:

ఒక కొండమీద ఒక బంగారు గంట వేలాడ దీయబడి ఉంది. చుట్టూ వున్న ఏడు రాజ్యాలకు వినిపించేలాగా ఆ గంటను మోగించాలి. ఇదీ రాకుమారుడు చేయవలసిన మూడవ కార్యం.

రాజు ఆ మాట చెప్పగానే రాకుమారుడు ఆ కొండమీదికి చేరి, మళ్ళీ ఒకసారి రాక్షసుణ్ణి తలుచుకున్నాడు. మరుక్షణమే, "ఆజ్ఞాపిం చండి!" అంటూ రాక్షసుడు చేతులు మోడ్చి అతని ఎదుట ప్రత్యక్షమయ్యాడు.

"రాక్షసమిత్రమా! ఈ గంటను గట్టిగా మోగించగలవా?" అన్నాడు రాకుమారుడు.

రాక్షసుడు గంటకు వేలాడుతూన్న తాడు అందుకుని దశదిశలూ మారుమ్రోగేలా గంటను మోగించాడు. ఆ గంటానాదం రాజుకు కూడా వినిపించడంతో ఆయన పెళ్ళి ఏర్పాట్లు ప్రారం భించాడు. మల్లెల యువరాణి, రాకుమారుల వివాహం ఘనంగా జరిగింది. రాజు ఇచ్చిన కాను కలతో, భార్యను తీసుకుని రాకుమారుడు రథంలో ఊరేగింపుగా తన రాజ్యానికి తిరుగు ప్రయాణమయ్యాడు.

మార్గమధ్యంలో ఒక గ్రామం తారసపడింది. అక్కడ సంత జరుగుతోంది. అక్కడ కొందరు ఆటగాళ్ళు, శిక్షణపొందిన కోతులతో ఆటలా డిస్తున్నారు.

"అదేమిటి?" అని భర్తను అడిగింది ఏడు మల్లెల బరువున్న మల్లెల యువరాణి. ఆమె

## కళలు-హస్తకళలు

గంధపుచెక్కల మీదా, దంతాల మీదా సునిసిత మైన శిల్పాలు, చిత్రాలు చెక్కడంలో సోరాబ్, సాగర్, కుమ్టా ప్రాంతాలలోని గుడిగరలు ప్రసిద్ధులు. గంధం చెక్కలతో శిల్పాలు, రోజ్‌వుడ్ మీద చెక్కడాలు, బిద్రివేర్, లక్కబొమ్మలు, టెర్రకోట, మొదలైన వాటికి కర్నాటక పెట్టింది పేరు. పట్టు పరిశ్రమలో కూడా ఈ రాష్ట్రానికి ప్రత్యేకమైన స్థానం ఉంది.







## పర్యాటక ప్రదేశాలు

కర్నాటక రాష్ట్రాన్ని పర్యాటకుల స్వర్గంగా వర్ణిస్తారు. ప్రకృతి సౌందర్యానికీ, మానవ నిర్మిత అద్భుతాలకూ ఈ రాష్ట్రం నిలయం. బంది పూర, నాగరహోలె వన్యమృగ సంరక్షణా నిలయాలలో ఏనుగులు, అడవిదున్నలు, గౌర్‌లూ, లాంగూర్‌లూ విరివిగా ఉన్నాయి. శరావతినది ఎత్తయిన జోగ్ జలపాతంతో కనులవిందు చేస్తోంది. మైసూరులోని బృందా వన్‌గార్డెన్స్, మైసూర్ రాజభవనం పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. బళ్ళారి, చిత్రదుర్గ్‌లోని కోటలు; బాదామి, అయిహోలెలోని గుహాలయాలు; హలెబీడు, బేలూరులలోని సునిసితమైన శిల్పకళకు తార్కాణంగా నిలచిన దేవాలయాలు; శ్రావణ బెళగొళలోని బ్రహ్మాండమైన గోమతేశ్వర ఏక శిలావిగ్రహం; చాముండి నందీవిగ్రహం; హంపీ నగర శిథిలాలు; హోయసాలుల దేవాలయాలు, బిజాపూర్‌లోని గోల్‌గుంబజ్ పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి.

సున్నితమైన పువ్వులా ఎంతో సుకుమారంగా పెంచబడింది. అంతకు ముందెన్నడూ ఇలాంటి దృశ్యాన్ని చూసి ఎరుగదు.

"వెళ్ళి చూద్దాం, రా!" అంటూ రాకుమారుడు రథంపైనుంచి కిందికి దిగి, యువరాణికి చేయి అందించాడు. భర్త చేయి పట్టుకుని ఆమె మెల్లగా దిగింది. ఇరువురూ కోతుల ఆట జరుగుతూన్న చోటికి చేరారు.

కోతులనూ, వాటి ఆటలనూ చూసి, అంతకు ముందెన్నడూ నవ్వి ఎరుగని మల్లెల యువరాణి ఆనందంతో పకపకా నవ్వింది. ఆమె నోటినుంచి మూడు మల్లెపువ్వులు రాలాయి. రాకుమారుడు వాటిని జాగ్రత్తగా తీసుకుని రెండవ పువ్వును తన తలపాగాలో భద్రంగా దాచాడు.

తిరుగు ప్రయాణంలో రాజకుమారుడు, సర్పరాజును చూసిన మర్రివృక్షం వద్ద ఆగాడు. సర్పరాజుకు తాను తెచ్చిన మల్లెపువ్వును ఇచ్చాడు. దానిని వాసన చూడగానే సర్పరాజు తలనొప్పి మటుమాయమయింది. "నా అవసరం కలిగినప్పుడు ఈ మణిలోకి చూడు!" అన్న అక్షరాలుపొదిగిన విలువైన మణిని, సర్పం రాకుమారుడికి బహుమతిగా ఇచ్చింది.

అలా పాముల బెడదను పోగొట్టడానికి వెళ్ళిన రాకుమారుడు, తన మంచి స్వభావంతో మిత్రులెందరినో సంపాయించాడు. వాళ్ళ సాయంతో ఘనకార్యాలెన్నో సాధించి, అపురూప సౌందర్యవతిని పెళ్ళాడి రాజధానికి తిరిగి వచ్చాడు. రాకుమారుడి తల్లితండ్రులు, కుమారుడి రాకకు పరమానందంచెంది ఘనంగా వేడుకలు జరుపుకున్నారు.

# చందమామ కబుర్లు

## అంతరిక్ష ప్రయాణానికిటిక్కెట్లు!




అంతర్జాతీయ అంతరిక్ష నిలయానికి (ఇంట ర్నేషనల్ స్పేస్ స్టేషన్) రెండవ పర్యాటకుడు ఏప్రిల్ నెలలో వెళ్ళడం అన్నది దాదాపు రూఢి అయినట్టే. ఇందుకోసం దక్షిణ ఆఫ్రికాకు చెందిన వ్యాపారవేత్త మార్క్ షటిల్‌వర్త్ అప్పుడే 20 మిలియన్ అమెరికన్ డాలర్లు చెల్లించాడు కూడా. ఆయన వయసు 28 సంవత్సరాలు. దాదాపు ఒక సంవత్సరం క్రితం అమెరికాకు చెందిన డెన్నిస్ టిటో అంతరిక్ష నిలయానికి వెళ్ళివచ్చిన విధానం అమెరికా అంతరిక్ష సంస్థ 'నాసా' కు అంత సంతృప్తికరంగా లేదు. అందు వల్ల ఇప్పుడు వెళ్ళనున్న షటిల్‌వర్త్‌కు ఈ విషయంగా అవసరమైన శిక్షణ ఇవ్వాలని నిర్ణయించింది. ఆయన రష్యన్ రాకెట్‌లో బయలుదేరే ముందు రష్యాలో కూడా ప్రత్యేక శిక్షణ పొందుతాడు. అదేసమయంలో 'అంతరిక్ష ప్రయాణం' పట్ల ఆసక్తి ఉన్నవారికి బ్రిటన్ 'వీసా' నియమావళిని విడుదల చేసింది. మద్యం, సిగరెట్లు, మాదక ద్రవ్యాల అలవాటు ఉన్నవారు వీసాకు అర్హులు కారు. చక్కటి ఆరోగ్యం ఉండాలి. మంచి ఆంగ్లభాషా పరిజ్ఞానం కూడా తప్పనిసరి!

## కుజగ్రహ వాసులకు సంగీతం!

2003 డిసెంబర్ 23 వ తేదీ బీగిల్ 2 అనే ఉపగ్రహం కుజగ్రహంపై దిగే సమయంలో-అందులోనుంచి బ్రిటిష్ పాప్ బ్యాండ్ 'బ్లర్' సమకూర్చిన సంగీతం వినిపిస్తుంది. బ్లర్ పాప్ బ్యాండ్ సంగీతాన్ని అభిమానులు 'లోకాతీత సంగీతం'గా అభివర్ణిస్తూ ఉంటారు. ఆ మాటను అక్షరాలా నిజం చేయాలన్న ఆశయంతో బృంద సభ్యులు తమ



సంగీతాన్ని భూప్రపంచానికి దూరంగా తీసుకు వెళ్ళాలని నిర్ణయించారు! 'బీగిల్ హేస్ ల్యాండెడ్' అనే గీతానికి 'బ్లర్' సంగీతం సమకూర్చింది. దానిని కుజగ్రహంపై ఉన్నవాళ్ళూ, భూమిమీద ఉన్న వాళ్ళూ ఒకే సమయంలో వినడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి!



# విఘ్నేశ్వరుడు

పార్వతి పుత్రగణపతి కేకకు బిరబిరా వచ్చి, తల తెగిపడి ఉన్న బాలుణ్ణి చూసి, శివుణ్ణి చురచుర చూస్తూ, "ఎంత పనిచేశావు! మన పుత్రుణ్ణి నరికావు! పుత్రహంతకుడివి!" అంటూ కుప్పలా కూలబడి భోరుమని శోకించసాగింది.

అంతవరకు స్తంభించిపోయి చూస్తున్న గుంపులో ఒక్కసారిగా కలకలం సముద్ర ఘోషలాగా చెలరేగింది. పెద్దనేరం చేసిన వాణ్ణిలాగ శివుణ్ణి చూడసాగారు. శివుడికి ముచ్చెమటలు పోశాయి. బిక్కముఖం పెట్టి, "నాకు తెలియని పుత్రుడా! ఎలాగవచ్చాడు?" అన్నాడు.

పార్వతి తనవంటికి పెట్టుకున్న నలుగు ముద్ద ఏవిధంగా పుత్రగణపతి అయినదీ చెప్పింది. దానికి శివుడు పెదవి విరిచి, కోపంగా చూస్తూ, "నీకు కుమారుడైతే కావచ్చు. అందుకే అమ్మ, అమ్మ అంటూ తెగవాగాడు. మన పుత్రుడంటున్నావు, ఆ పొగరుబోతు నాకుపుత్రుడెలాగఅవుతాడు?" అని అడిగాడు.

పార్వతి తెల్లబోయింది. అప్పుడు విష్ణువు బ్రహ్మకు సైగచేశాడు. బ్రహ్మ ముందుకు వచ్చి, "శివుడు పార్వతి చేతిని పుచ్చుకున్నప్పుడే శివుడి తేజస్సు పార్వతి శరీరం నిండా ప్రవేశించి పులకరింపజేసింది. అది మొదలు శివుడు, పార్వతిలో సగభాగంగా అంతర్లీనమై ఉంటూనే ఉన్నాడు. పుత్రగణపతి శివుడి కుమారుడే!" అని నాలుగు నోళ్ళతో నొక్కి చెప్పాడు.

శివుడు చేతులు నలుపుకుంటూ దిక్కులు చూస్తూంటే, పార్వతి బాలుడి కళేబరం మీద పడి ఏడుస్తూంటే, ఆకాశం నుండి, "ఉత్తర



దిక్కుకు తలపెట్టి నిద్రిస్తూన్న తలను తెచ్చి నాకు అతకండి, నేను లేస్తాను!'' అన్న పుత్ర గణపతి వాక్కులు వినిపించాయి.

వెంటనే దేవతలూ, ప్రమథులూ చుట్టు పక్కల అంతా గాలిస్తూ ఎంత వెతికినా ఉత్తర దిక్కుకు తలపెట్టి నిద్రిస్తున్నవాళ్ళెవ్వరూ కనిపించలేదు.

ఇంకా వెతుకుతూ పోగాపోగా సహ్యాద్రి పర్వతం మీద బిల్వవనంలో ఒకతెల్లని ఏనుగు గున్న మాత్రం ఉత్తర దిక్కుకు తెలపెట్టి నిద్రిస్తూనే, నిరంతరాయంగా శివస్మరణ చేస్తూ కనిపించింది.

ఆ ఏనుగుగున్న దేవలోకంలో దేవతా గజమైన ఐరావతం కుమారుడైన గజేంద్రుడు. ఐరావతం ఇంద్రుడి వాహనం. ఒక సారి ఇంద్రుడు ఐరావతం ఎక్కి ఉల్లాసంగా అలా వస్తూంటే గజేంద్రుడు అతణ్ణి లెక్క చేయకుండా తన ధ్యాసలో తానుండటం చూసి ఇంద్రుడు కళ్ళెర్రజేసి, ''నా వాహనం కొడుక్కు ఇంతపొగరా!'' అని దుర్భాషలాడాడు.

అప్పుడు గజేంద్రం ఎంతో శాంతంగా, ''నా తండ్రి తన విధిని తాను చేస్తున్నాడు. అంత మాత్రం చేత నీవు మమ్మల్ని తక్కువచేసి మాట్లాడవలసిన పనిలేదు. అంతకన్నా నేను నీకు భయపడాల్సిందేమీలేదు,'' అన్నాడు.

''నేను దేవేంద్రుణ్ణిరా, ఏనుగా!'' అన్నాడు ఇంద్రుడు గర్వంగా.

''ఔను, నేను ఏనుగును, గజేంద్రుణ్ణి! మరొకరు నాగేంద్రుడైతే, ఇంకొకరు పక్షీంద్రుడు. ఇలా ఎంతమంది ఇంద్రుళ్ళున్నా ఉండవచ్చు. నూరు యజ్ఞాలు చేస్తే చాలు, ఇంద్రపదవి పొందవచ్చు, తపస్సుతో సాధించవచ్చు. అందుకే ఎవరెక్కడ ఏది చేస్తున్నారని తెలిసినా నీకు తగని భయం! అయినా ఇంద్రత్వం ఏమంత గొప్పదని నీవు జ్ఞానంతో చెప్పుకుంటున్నావు?'' అన్నాడు గజేంద్రుడు.

ఇంద్రుడు రెచ్చిపోయి శపించుతున్నట్లుగా, ''నీ తల తెగా!'' అని తిట్టాడు.

గజేంద్రం నవ్వుతూ, ''శివుడి ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదుగదా, మునుముందు ఆ తల ముందే నీ తల వంచవలసివస్తుందేమో ఎవరికెరుక!'' అన్నాడు.

గజేంద్రం గొప్ప జ్ఞాని అని గుర్తించలేని గర్వాంధుడైన ఇంద్రుడు, ''ఆ శివుణ్ణే నమ్ముకో, భూమ్మీద పడు!'' అని గజేంద్రాన్ని స్వర్గం నుంచి కిందకు తోసేశాడు. గజేంద్రం సహ్యాపర్వతం మీద పడి, ఎల్లప్పుడూ శివ సంస్మరణం చేసుకుంటూ, శివుడి నివాసమైన కైలాసం ఉండే ఉత్తర దిక్కుకే తలపెట్టుకొని నిద్రిస్తూండేది.

దేవతలు గజేంద్రం తలను నరికి తీసుకెళ్ళారు. ఆ తలను శివుడు బాలుడి కళేబరానికి అతికించిన మరుక్షణమే పుత్రగణపతి ఏనుగు ముఖంతో కళకళలాడుతూ లేచి నించున్నాడు.

"నా ముద్దులయ్యకు ఏనుగు ముఖం ఏమిటి? నేను చూడలేను," అని పార్వతి దుఃఖంతో కళ్ళు మూసుకుంది.

అప్పుడు గజముఖుడు వీనులు విందు చేసే స్వరంతో, "అమ్మా! ఎందుకు అలా విచారిస్తావు? జరగాల్సిందంతా నిర్విఘ్నంగా జరిగింది! ఆనాడు మీరిద్దరూ గోడమీద ఏనుగుల చిత్రాన్ని చూస్తున్నప్పుడు కనిపించిన నన్ను గుర్తించలేదా? నేను విఘ్నేశ్వరుణ్ణి!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే పార్వతికి కల వచ్చినట్లుగా ఆ విశేషమంతా కనిపించింది. శివుడికీ అలాగే విఘ్నేశ్వరుడు స్ఫురణకు వచ్చాడు.

"విఘ్నేశ్వరా! నీవా, మాకు పుత్రుడవై అవతరించావా! ఇందుకా నన్ను అంతగా కవ్వించి కయ్యానికి కాలుదువ్వి, నాకు కోపం తెప్పించింది! నాకు ఇప్పుడు అంతా బోధపడుతున్నది. నీ లీల అద్భుతం! మహాద్భుతం!" అన్నాడు శివుడు.

"లేకపోతే గజాసురుడికి, నువ్వు ఇచ్చిన వాగ్దానాలు ఎలాగ నెరవేరతాయనుకున్నావు?" అని విఘ్నేశ్వరుడు జ్ఞాపకం చేశాడు.

శివుడు, "బాగా జ్ఞాపకంచేశావు, నేను గజచర్మాన్ని కూడా కట్టుకోవలసి ఉన్నది. ఏనుగుతల నా కుమారుడికి ఉండనే ఉన్నది!" అన్నాడు. ఆ తర్వాత గజచర్మాన్ని తెప్పించి కట్టుకున్నాడు.



శివుడు, విఘ్నేశ్వరుడికి వినయంగా వంగి, "విఘ్నేశ్వరా! నీ విశ్వరూపాన్ని చూపించు!" అని కోరాడు.

అప్పుడు విఘ్నేశ్వరుడు ఆకాశానికి పెరిగి ఐదు తలలతో కనిపించాడు. భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము అనే పంచభూతాల రంగులైన ఆకుపచ్చ, మబ్బు రంగు, ఎరుపు, తెలుపు, నీలం రంగులు అయిదు ఏనుగు తలలకూ ఉన్నవి. ఆ తలలపై నక్షత్రాలు తల పూవులుగా మెరుస్తున్నవి. విఘ్నేశ్వరుడి గుండ్రని పెద్ద బొజ్జ మినుకు మినుకుమనే కాంతులతో ఆకాశాన్ని పోలిఉన్నది. అతని అనేకమైన చేతుల్లో అంకుశము, గొడ్డలి, పాశము, కలశములతోబాటు త్రిమూర్తులకు చెందిన శంఖ చక్ర గదా పద్మ ఢమరుక త్రిశూల వజ్రాయుధాలు, జపమాల, కమండలువు, వీణ, ఖడ్గము, శక్తి, ఈటె



మొదలైనవన్నీ ఉన్నాయి. అతని రూపాన్ని తలలు పైకి సారించి చూస్తున్నవారంతా కళ్ళు మిరుమిట్లుగొలిపే అతని తేజస్సు చూడలేక తలలు దించారు. అప్పుడు అందరిలోనూ ఏదో మహానందం కలిగింది. సరస్వతి వీణ తీసి విఘ్నేశ్వరుడికి ప్రియమైన హంసధ్వని రాగాన్ని సంరంభంగా దురితగతితో పలికిస్తూంటే, నారదుడు మాయామాళవ గౌళరాగాన్ని మధ్యమధ్య అద్భుతంగా జోడించాడు. శివుడు ఆనంద తాండవం చేశాడు.

ఇంద్రుడితో సహా ముక్కోటి దేవతలు తలలు వంచి విఘ్నేశ్వరుడికి నమస్కరించారు. అప్పుడు ఇంద్రుడి చెవుల్లో, 'ఆ తల ముందే నీ తల వంచవలసి వస్తుందేమో!' అని గజేంద్రం అన్నమాటలు గింగురుమన్నాయి. పుత్రగణపతికి అతికిన తల గజేంద్రానిదని అతనికి తెలుసు. ఇంద్రుడు చెవులు పట్టుకొని మూడు సార్లు వంగి లేస్తూ లెంపలేసుకుని సాష్టాంగపడి మ్రొక్కి, "గజేంద్రా! నీవు జ్ఞానివి, నేను అజ్ఞానిని, నా గర్వాన్ని మన్నించు!" అని మనస్సులో భక్తితో అనుకున్నాడు. దేవతలంతా ఇంద్రుడు చేసినట్లే అనుకరించి మ్రొక్కారు.

విశ్వరూపం దాల్చిన విఘ్నేశ్వరుడితో శివుడు, "విఘ్నేశ్వరా! నీ రూపానికి ఎన్నో విశేషార్థాలున్నట్టుగా మాకు తోస్తున్నది, తెలుసుకోవాలని కుతూహలపడుతున్నాము," అని అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "శివభక్తుల సమ్మేళనమే ఈ విశ్వం. నేను విశ్వజననీ జనకులైన పార్వతీ శివులకు పుత్రుణ్ణి మాత్రమే, వారికి అంజలి ఘటిస్తున్నాను!" అని అంటూ చేతులెత్తి జోడించి ఊరుకున్నాడు.

బ్రహ్మ ముందుకు వచ్చి ఇలా చెప్పాడు: "మత్స్యావతారం ఎత్తి విష్ణువు సోమకాసురుణ్ణి సంహరించి వేదాల్ని భద్రపరిచాడు. నిండు చందమామ కాంతుల్ని విరజిమ్ముతూ విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించి వాటిని నాకు అందజేశాడు. నాకు జ్ఞానసిద్ధి కలిగింది. అప్పుడు విఘ్నేశ్వరుని గురించి విశేషాలు చాలా తెలుసుకున్నాను. సంకల్పసిద్ధికి మూలమైన విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించి సక్రమంగా సృష్టిచేయగల్గాను.

విఘ్నేశ్వరుడు విరాట్ స్వరూపుడు. వ్యాపించేవాడు గనుకనే, 'విష్ణుం' అని అనిపించుకున్నాడు. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, మట్టి అనే పంచమహాభూత గణానికి అధిపతి గనుకనే విఘ్నేశ్వరుడు మహాగణాధిపతి! లక్ష్మీ సరస్వతుల నిలయంగా నడుమనున్న విశ్వరూప విఘ్నే



శ్వరుడి ఐదు తలలూ శ్వేతనీలము, ఊదా, ఎరుపు, శ్యామ నీలము, పచ్చ రంగులతో పంచమహాభూతాలకు ప్రతి రూపాలుగా ఉన్నవి.

ఏనుగు తల బలానికీ మేధస్సుకీ చిహ్నం; బొజ్జ ఉండగానే సంబరం కాదు. తగినంత మేధస్సు ఉండాలని అర్థం. కొత్తవి పడుతూ ఉంటే, పాతవి జీర్ణం అవుతూండే తినుబండారాలకుమల్లే, అనంతాకాశంలో నక్షత్ర మండలాలు, గ్రహాలు, ఉపగ్రహాలు, గోళాలు, లోకాలు నిండి ఉన్నాయని లంబోదరం గుర్తుచేస్తూన్నది. ఈయన త్వరలోనే చిన్న ఎలుకనెక్కి తిరగబోతున్నాడు. అంటే సూర్యచంద్రాది గ్రహాలు, మహామండలాలు శూన్యాకాశంలో గతులు తప్పకుండా అంత లాఘవంగా తిరుగుతున్నాయనీ, విశ్వస్వరూపం చిట్టెలుకపై ఏనుగు స్వారీ లాంటి చిత్రాతి చిత్రమైన విజ్ఞానంతో నిండి ఉన్నదనీ చెప్పడం అన్న మాట! విశ్వవిజ్ఞానానికి విఘ్నేశ్వరుడు సంకేతం; అందుకే విజ్ఞానేశ్వరుడు అనబడుతున్నాడు.

విశ్వానికి అధినేత, నియంత అంకుశాన్ని ధరించాడు. బుద్ధిబలానికి విఘ్నేశ్వరుడు గురుతు! బుద్ధి వెర్రితలలు వేయకుండా మావటివాడు ఏనుగును ఉంచినట్లుగా, అదుపులో ఉంచాలని అంకుశం మనోనిగ్రహానికి ప్రతిరూపంగా ఉన్నది. సర్వమూ తమ తమ ధర్మాలకు కట్టుబడి ఉన్నదని విఘ్నేశ్వరుని చేతనున్న పాశము చెబుతున్నది. పరిపూర్ణత తొణకని బెణకని నిండుకుండ లాంటిదని, కలశాన్ని ధరించాడు. పరశువుతో విఘ్నాన్ని చిన్నాభిన్నంచేస్తాడు. విశ్వం నాదాత్మకమైనది.. అనేక ఓంకార ఝుంకారాల్ని ధ్వనించే విశ్వవీణనే విఘ్నేశ్వరుడు మీటుతున్నాడు. చరాచర జీవకోట్ల మొరలన్నీ

వినడానికే అంత పెద్ద చెవులు రిక్కించి ఉన్నాడు. ఏనుగు కళ్ళు చిన్నవైనా సూక్ష్మ దర్శనం కలిగి, నిశితంగా చూడగల్గినట్లే, పరమాణువు మొదలుకొని బ్రహ్మాండాల్ని పరిశీలిస్తున్నాడు. వంపు పెట్టిన వక్రతుండం వంకల్ని తుండతుండాలుగా చేసి సరిదిద్దుతుంది. తొండం నిడుపుగా సాగి ఎన్నిటినైనా అందుకుంటుంది, అందిస్తుంది!

సస్యసమృద్ధికి విఘ్నేశ్వరుడు అధినాథుడు. భోజనప్రియుడు గనుక, ఆహారం వల్లనే కండబలమూ, కండబలం ఉంటేనే బుద్ధిబలానికి నిలకడ, సార్థకత ఉంటాయని పండ్లూ, పిండివంటలూ, ఆకు కూరలూ వద్దనకుండా స్వీకరిస్తాడు. భాద్రపదమాసంలో ఏనుగుల్లాంటి మేఘాలు తొండాల వంటి వర్షపుధారలు కురుస్తాయి. మేఘ గణాలకు నాథుడు గణనాథుడు! విఘ్నేశ్వరుడు అవతరించినది భాద్రపద మాసమే. భాద్రపద శుక్ల చవితినాడు విఘ్నేశ్వరుణ్ణి అర్చించిన వారికి సంకల్పసిద్ధితోపాటు, అన్ని విఘ్నాలను అరికట్టుకోగల బుద్ధి నిబ్బరము కలుగుతుంది.

తన దంతపు గంటాన్ని మోపినది ఎత్తకుండా విఘ్నేశ్వరుని చేతి మీదుగానే పంచమ వేదం అనదగ్గమహాభారతం అక్షరసిద్ధిపొంది, చిరస్థాయిగా నిలుస్తుంది. విఘ్నరాజు మహిమలు వర్ణించడం నాతరం కాదు. ఏ కార్యమైనా తలపెట్టే ముందు విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించి, పూజించి మరీ ప్రారంభించాలి. శుభం కలుగుతుంది అంటూ అభయముద్ర పట్టి ఉన్నాడు. మహాగణాధిపతి అందరికీ ప్రథమ ఆరాధ్య దైవము!'' అని బ్రహ్మ ముగించాడు.

అప్పుడు శివుడు అందర్నీ కలయజూసి, ''బ్రహ్మవాక్కు విన్నారుకదా. విఘ్నేశ్వరుడు తొలిపూజ దేవర!'' అన్నాడు.

అందరూ ఔను, ఔను అని తలలూపారు. నారదుడు హంసధ్వనిరాగాన్ని వీణపై హోరెత్తిస్తూంటే, సరస్వతి హంసానంది రాగాన్ని అందుకుంది. ఆ సంరంభంలో పార్వతి విఘ్నేశ్వరుడికి నమస్కరించబోతూంటే, విశ్వరూప మహాగణాధిపతి, ''అమ్మా, అమ్మా వద్దు!'' అని వారిస్తూ చప్పున విశ్వరూపాన్ని ఉపసంహరించుకుని, గుజ్జు వినాయకుడై తల్లి కాళ్ళు చుట్టేసుకున్నాడు.





# మానవధర్మం!

విష్ణుపురం అనే గ్రామంలో, విష్ణుశర్మ అనే పండితుడుండేవాడు. ఆయన గ్రామంలోని ఒక చిన్న గురుకులంలో గ్రామస్థుల పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పుతూ సుఖంగా జీవిస్తున్నాడు. ఆయనకు జ్ఞానశర్మ అని ఒక్కడే కొడుకు. జ్ఞానశర్మ చక్కగా చదువుకుని, గణితంలో దిట్ట అనిపించుకుని రాజుకొలువులో ఉద్యోగిగా రాజధానిలో వుంటున్నాడు.

విష్ణుశర్మ ఉపాధ్యాయ వృత్తి కారణంగా, తనకు తాతలనాటి నుంచి వున్న పొలాన్ని స్వయంగా వ్యవసాయం చేయలేక, రాజన్న అనే కాపుకు సేద్యానికిచ్చాడు.

ఈ దంపతులకు నడివయసులో సుబుద్ధి అనే కొడుకు పుట్టాడు. అతడు పేరుకు తగ్గట్టుగానే, విష్ణుశర్మ గురుకులంలో శ్రద్ధగా చదివి యుక్తవయస్కుడయ్యాడు.

ఒకనాడు జ్ఞానశర్మ, తల్లిదండ్రులను చూసి వెళ్ళేందుకు భార్యాబిడ్డలతో విష్ణుపురం వచ్చాడు. అతడు రాజాస్థానంలో ఉన్నతపదవిలో వుండడం వల్ల, జోడు గుర్రాలు పూన్చిన బండిలో, వెంట ఐదారుగురు నౌకర్లతో రావడం జరిగింది. ఆ వైభవం చూసిన సుబుద్ధికి, తానుకూడా రాజు కొలువులో ఉద్యోగం సంపాయించాలన్న కోరిక కలిగి, ఆ సంగతి తల్లిదండ్రులకు చెప్పాడు.

రాజన్న రమణమ్మలు, కొడుకు కోరిక విని విస్తుపోయారు. రాజన్న సుబుద్ధితో, "బాబూ, వ్యవసాయం మన కులవృత్తి. అవకాశం వుండడంచేత నిన్ను విష్ణుశర్మగారి గురుకులంలో చదివించాను. ప్రతివాడూ ఉద్యోగమే కోరుకుంటే, నేలతల్లిని సాకేదిఎవరు? చదువుకున్నాను కాబట్టి మట్టిపిసకడం అవమానం అని భావించి, ఉద్యోగం కోసం వెంపరలాడకు," అన్నాడు.

తల్లి రమణమ్మకూడా, "ఉద్యోగమంటూ నిన్ను దూరంగా పంపించలేం. నేలతల్లిని నమ్ముకున్న మేము, నీతో ఉద్యోగపుటూరుకు రాలేం," అన్నది.

తల్లిదండ్రుల మాటలు సుబుద్ధి మనస్సును మార్చలేకపోయాయి. సుబుద్ధి ఒక

డా. జొన్నలగడ్డ మార్కండేయులు



రాత్రివేళ చేతిసంచీలో బట్టలు సర్దుకుని, తండ్రి ధాన్యం అమ్మి దాచిన డబ్బులోంచి కొంచెం తీసుకుని, ఉద్యోగం కోసం రాజధానికి బయల్దేరాడు.

తెల్లవారేసరికి సుబుద్ధి ఒక గ్రామ పొలిమేర ప్రాంతాన్ని చేరుకున్నాడు. ఆ సమయంలో, తాటి చెట్టుపైనుంచి కల్లుముంతతో దిగిన, అతడి ఈడువాడే అయిన ఒక యువకుడు సుబుద్ధిని పలకరించాడు. సుబుద్ధి వాడికేసి చిరాగ్గాచూసి, "సప్త వ్యసనాల్లో ఒకటైన కల్లును తీసే నీకు, నాతో పనేమిటి? నీ దారిన నువ్వు పో," అన్నాడు.

అందుకు కల్లుగీత యువకుడు నవ్వి, "నా చేతిలోవున్న కల్లుముంతను చూసి అంతగా చీదరించుకోకు. నా పేరు కుశలయ్య. నేను కూడా చదువుకున్నాను. ఉద్యోగం చేస్తే సుఖాలే కాక, ఎంతో గౌరవం వుంటుందని భావించాను. కానీ, మనిషికి కొన్ని బాధ్యతలున్నాయి. అది తెలుసుకోలేక, ఇంట్లోంచి వెళ్ళిపోయాను. నాకోసం ఏడ్చి ఏడ్చి, నా తల్లిదండ్రులు గుడ్డివాళ్ళయ్యారు. ఆ విషయం తెలుసుకున్న నేను ఇంటికి వచ్చేశాను. ఇప్పుడు వాళ్ళ సంతోషం కన్నా, నాకు వేరే ఏ కోరికా లేదు," అన్నాడు.

"సరే, తాటిచెట్లెక్కడం, దిగడం, కల్లు కంపు, ఈగల ముసురు-ఇదంతా నీకు ఏమైనా మహదానందం కలిగిస్తున్నదా?" అని అడిగాడు సుబుద్ధి వెటకారంగా.

దానికి యువకుడు ఏమాత్రం నొచ్చుకోకుండా, "నేను కుటుంబ ధర్మాన్ని పాటిస్తున్నాను, అదే నాకు మహదానందం. నీ అవసరం నీ తల్లిదండ్రులకుంటే, వెంటనే తిరిగి పో," అన్నాడు.

ఆ జవాబుకు సుబుద్ధి ఒక క్షణం వెలవెలపోయి, "కుశలయ్యా! నీ మాటలెంతో ప్రబోధాత్మకంగా వున్నాయి. కానీ, కోరికలనేవి వరదప్రవాహం లాంటివి. ప్రస్తుతానికి ఆ ప్రవాహాన్ని అదుపుచేయగల శక్తి నాలో లేదు, వస్తాను!" అంటూ ముందుకు సాగాడు.

ఇప్పుడు సుబుద్ధికి తల్లిదండ్రులు గుర్తుకు రావడంతో, అతడిలో దిగులు మొదలైంది. మధ్యాహ్నం వరకు ప్రయాణం సాగించి, ఆకలి ప్రారంభంకావడంతో, ఒక గ్రామం సమీపంలో వున్న పూరి ఇంటిని సమీపించాడు. ఆ ఇంట్లో నడివయస్కుడొకడున్నాడు. అతడు చుట్టూ చిందరవందరగా పడివున్న ఏవో మూలికల మధ్య సగం నూరిన కల్వం పక్కన కూర్చుని, ఏదో ప్రాచీనగ్రంథంలోకి పరిశీలనగా చూస్తున్నాడు.

అతడు, సుబుద్ధి అడుగుల చప్పుడు వింటూనే తలెత్తి చూసి, ''బాగా ఎండనపడి వచ్చారు. ఎక్కడికి ప్రయాణం?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నా, ఆ నడివయస్కుడి ఎత్తయిన నుదురూ, అతడిలో కనిపిస్తూన్న ప్రశాంతతా చూసి, సుబుద్ధి చలించిపోయి, తన ప్రయాణం ఎక్కడికో, ఎందుకో వివరించాడు.

అంతా శ్రద్ధగా విన్న నడివయస్కుడు, ''నా పేరు గురునాథం. నా అనేవాళ్ళు లేరు. జీవితం మీద విరక్తితో వున్న సమయంలో, ఒక సిద్ధుడు ఓదార్చి ఈ ప్రాంతానికి తీసుకు వచ్చాడు. ఆయన రచించిన వైద్యగ్రంథం ద్వారా పలు వైద్య విషయాలు తెలుసుకుంటున్నాను. ప్రస్తుతం, చూపు మందగించినవారికి చూపు తెప్పించే మూలికామందు తయారీలో వున్నాను. ఇది సిద్ధుడి ఆశ్రమం. ఆయన ఒక ముఖ్యమైన పనిమీద ఉదయానే బయటికి వెళ్ళారు, ఏక్షణాన అయినా తిరిగి రావచ్చు,'' అన్నాడు.

ఒక పావుగంట గడిచేలోపలే సిద్ధుడు ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. ఆయన, సుబుద్ధి వృత్తాంతమంతా తెలుసుకుని సేద తీరేలా భోజనం పెట్టి ఆదరించాడు.

తర్వాత సిద్ధుడు, సుబుద్ధితో, ''నీకు కనిపించిన కల్లుగీత కుశలయ్య గొప్ప జీవిత సత్యం చెప్పాడు. నాలాంటి సిద్ధులు, ఈ గురునాథంలాంటివాళ్ళు ఎక్కడున్నా సరిపోతుంది. మాకు భవబంధాలు లేవు. లోకానికుపయోగించే కొత్త విషయాలు కనుక్కోవడమే, మా పని. కుశలయ్య ధన్యుడు. తల్లినీ, తండ్రినీ, కుటుంబాన్నీ సేవించాలన్న మానవధర్మంతో, తన వృత్తిలో గొప్పతనాన్ని చూశాడు. ఇందులో



వున్న సత్యం నేను నిరూపిస్తాను. మనం ఆ కుశలయ్య ఇంటికి వెళదాం!'' అన్నాడు.

సిద్ధుడు, సుబుద్ధి, గురునాథం కలిసి కుశలయ్య ఇంటికి వెళ్ళారు. చూపులేని తన తల్లిదండ్రులకు, కుశలయ్య భారతం చదివి వినిపిస్తున్నాడు. అతడు వచ్చిన ముగ్గుర్నీ చూసి లేచి సాదరంగా ఆహ్వానించాడు.

సిద్ధుడు అతడితో, ''కుశలయ్యా! నీ తల్లిదండ్రుల సేవ మెచ్చదగింది. నీ కథంతా, ఇదిగో ఈ సుబుద్ధివల్ల తెలిసింది. నీ తల్లిదండ్రులకు వెంటనే చూపు తెప్పించగలిగే మూలికామందు తెచ్చాను. మీ మనసుల్లో, వీరికి చూపు రావాలని కోరుకుంటూ, కళ్ళకు ఈ మందు పూయండి!'' అని, ముందుగా గురునాథానికి మందున్న చిన్నభరిణె ఇచ్చాడు.

గురునాథం దాన్ని కళ్ళకద్దుకుని, ''సిద్ధ గురువర్యులు చెప్పినవిధంగా, నేనీమందు

తయారుచేశాను. ఇన్నాళ్ళకు మందు ప్రభావాన్ని పరీక్షించే అవకాశం వచ్చింది. మీకు చూపువస్తే నా జన్మ ధన్యమవుతుంది!'' అంటూ, కుశలయ్య తల్లిదండ్రుల కళ్ళకు మందు పూశాడు.

నాలుగైదు నిమిషాలు జరిగినా వాళ్ళకు చూపురాలేదు. తర్వాత సుబుద్ధిని ప్రయత్నించమన్నాడు సిద్ధుడు.

అప్పుడు సుబుద్ధి, ''నాకు తల్లిదండ్రులంటే ప్రేమలేక కాదు. ఉన్నతస్థితిలో వుంటే, వారికానందం కలుగుతుందని ఊరు విడిచి ఉద్యోగం కోసం బయలుదేరాను. నా కోరిక మంచిదే అని భావిస్తున్నాను. ఈ మందు తప్పకుండా ఫలితాన్నిస్తుందని నమ్ముతున్నాను,'' అంటూ కుశలయ్య తల్లిదండ్రుల కళ్ళకు మందు పూశాడు.

అందువల్ల ఏమాత్రం ఫలితం కనిపించలేదు. ఇది చూసి సిద్ధుడు చిరునవ్వునవ్వి, ''వినండి! నా అనేవాళ్ళు లేకపోయినా గురునాథంలో, తాను గొప్పవాడు కావాలన్న కీర్తికాంక్ష వుంది. గొప్పస్థితినీ, వైభవాలనూ ఆశించి, ఈ సుబుద్ధి తల్లిదండ్రులకు మనస్తాపం కలిగించాడు. ఇప్పుడు, ఈ కుశలయ్యద్వారా మందు ప్రయోజనకారి అవుతుందేమో చూద్దాం!'' అంటూ భరిణెను కుశలయ్యకిచ్చాడు.

కుశలయ్య తలవంచి సిద్ధుడికి నమస్కరించి, ''దేహమిచ్చిన తల్లిదండ్రులను సేవించి, వాళ్ళకోరికలకు అనుగుణంగా నడుచుకోవడమనే ఉత్తమ మానవధర్మాన్ని మాత్రమే, నేను పాటించాను. బ్రతుకుతెరువుకు ధనం సంపాయించిపెట్టే ఏ వృత్తిధర్మమైనా, ఆదరించే ప్రజలుంటే ధర్మబద్ధమైనదని నేను విశ్వసించాను!'' అంటూ తన తల్లిదండ్రుల కళ్ళకు మందు పూశాడు.

అందరూ అద్భుతపడేట్టుగా కొద్దిక్షణాల్లో కుశలయ్య తల్లిదండ్రులకు తిరిగి చూపు వచ్చింది. కుశలయ్య సిద్ధుడికి తన కృతజ్ఞతలు చెప్పాడు. సుబుద్ధి చేతులెత్తి అందరికీ నమస్కరించి, ''వృద్ధులైన కన్న తల్లిదండ్రులకు, ఆనందం కలిగించడమే మానవధర్మం అని తెలుసుకున్నాను,'' అని, భక్తితో సిద్ధుడి పాదాలంటి, విష్ణుపురం తిరిగివెళ్ళి, తల్లిదండ్రులు చెప్పినవిధంగా నడుచుకుంటూ సుఖంగా జీవించాడు.





# తెలుసు-తెలియదు

మంగళపురి రాజ్యాన్ని మాయవర్మ మహారాజు పాలించేవాడు. ఆయన ముఖ్యమంత్రి హఠాత్తుగా చనిపోయాడు. ఆయన పోయాక రాజు కొత్త మంత్రిని నియమించక తానే రాజూ, తానే మంత్రీ అయి శ్రద్ధగా రాజ్యపాలన చేయసాగాడు.

రాజైనవాడు ప్రజల కష్టసుఖాలను స్వయంగా తెలుసుకోవాలని అంతకుముందు ఎప్పుడో విని ఉండటంచేత అతను మారు వేషం ధరించి, ఇద్దరు అంగరక్షకులను వెంట బెట్టుకుని, అప్పుడప్పుడూ ప్రజల మధ్య తిరుగుతూ ఉండేవాడు. ఇంత చేసినా రాజుకు మెదడు చాలా తక్కువ.

ఒక రోజున ఆ రాజు మారువేషంలో తిరుగుతూండగా, ఒక ఇంట భార్యాభర్తల మధ్య గట్టిగా వాగ్యుద్ధం జరుగుతూండటం వినిపించింది. రాజు చప్పుడు కాకుండా గోడ చాటుకు వెళ్ళి వాళ్ళ మాటలను జాగ్రత్తగా వినసాగాడు.

"ఛీ, ఛీ! ఏం పని చేశావు? నీకు తెలీదని ముందే చెపితే, నేనే చేసేవాణ్ణిగా?" అన్నాడు భర్త కోపంగా.

"అనవసరంగా రాద్ధాంతం చేయకండి. మీకేమి తెలుసు? ప్రతిదీ తెలుసు, తెలుసు అంటారే గాని, నేను కన్న పసిపాపకు తెలిసినంత కూడా మీకు తెలీదు," అన్నది భార్య మరింత కోపంగా.

"నోరుముయ్యి! నీకేమన్నా తెలిస్తేగద నీ పాపకు తెలిసి ఏడిచేది? ఈ ముష్టిపని కూడా నాకు తెలీదనా నీ ఉద్దేశం? నన్ను గురించి నువ్వు ఏమనుకుంటున్నావో ఏమో! అవకాశం దొరికితే ఈ రాజ్యాన్ని ఏలేపాటి తెలివి ఉన్నది నాకు," అన్నాడు భర్త.

ఈమాట చెవిని పడగానే రాజు బాధతో చెవులు మూసుకుని తిన్నగా ఇంటికివెళ్ళాడు. తీవ్రంగా ఆలోచించి మర్నాడే ఆయన ఒక శాసనం అమలు పరిచాడు. ఆ శాసనం ప్రకారం రాజ్యంలో ఏ ఒక్కడూ తనకు ఏదైనా

తెలుసునని అనరాదు. "నాకు తెలుసు" అని ఎవరన్నా అన్నారో, వారు కఠినంగా శిక్షించబడతారు.

ఈ శాసనంతో ప్రజలకు పెద్దచిక్కే వచ్చింది. "ఎలాంటి శిక్ష పడుతుందో ఏమోనని భయ పడి వాళ్ళు ప్రతిదానికీ "తెలియదు," అనటం అలవాటు చేసుకున్నారు.

ఇలా ఉండగా ఆ రాజ్యంలోకి ఎవరో ఇద్దరు వేరేదేశంవాళ్ళువచ్చారు. తాముఎవరిని పలకరించినా, "తెలీదు, మాకు తెలీదు," అనే జవాబు రావటం వాళ్ళు గమనించి ఆశ్చర్య పోయారు.

వాళ్ళు ఒకచోట కొంతమందిని సమీపించి, "ఏది అడిగినా ప్రతి ఒక్కరూ, తెలియదంటా రేమిటి?" అని అడిగారు.

"తెలియదండీ, మా కేమీ తెలియదు. మీరు అడిగేసంగతి ఏదీ మాకు తెలియదు," అన్నారు అక్కడి వాళ్ళు.

"ఇదేం దేశంరా, పాడుదేశం. ఎవరిని ఏమడిగినా, తెలీదు, తెలీదంటారూ!" అని ఆ ఇద్దరు విదేశీయులూ తమలో తాము అనుకున్నారు.

ఇదంతా జరిగేటప్పుడు రాజు మొదటి నుంచీ అక్కడే మారువేషంలో వాళ్ళను అనుసరించి వెళ్ళి ప్రజలు అన్న మాటలూ, విదేశీయులు తమలో తాము అనుకున్న మాటలూ కూడా విన్నాడు.

అందుచేత రాజు మర్నాడు తెల్లవారగానే ఇంకో శాసనం జారీ చేశాడు. దేశంలో ఎవరూ ఎలాంటి పరిస్థితిలోనూ "తెలియదు" అనే మాట అనరాదు! అలా అన్నవాళ్ళు కఠిన శిక్షకు గురి అవుతారు.

ఇప్పుడు రాజ్యంలో "తెలుసు" అనేమాట గాని, "తెలియదు" అనేమాటగాని వినిపించ రాదు. దాంతో ప్రజల నోళ్ళు కట్టేసినట్టయి పోయింది.



ఇదంతా విదేశీయులు ఉండగానే జరిగింది, కనక వాళ్ళ పని బొత్తిగా పాడైపోయింది. వాళ్ళు రాజుగారి దర్శనం కోసం వచ్చి, ఈ విషయంగా రాజుగారికొక లేఖ పంపారు. అందులో ఇలాఉంది:

"మహాప్రభూ, మేము మరొకదేశం నుంచి వచ్చిన యాత్రికులం. మీరు చేసిన నిషేధాజ్ఞల మూలాన మాకు ఎవరితోనూ నోరు తెరిచే అవకాశం లేకుండా పోయింది. విదేశస్థులం కావడంచేత ఇదిమాకుచాలా బాధగా ఉన్నది. అయినా, మీరు ఇలాటి నిషేధం పెట్టటానికి తగిన మూలకారణం ఏదో ఉండి ఉంటుంది. దయతలిచి దాన్ని మీరు మాకు తెలిపినట్టయితే ఇప్పుడేర్పడిన పరిస్థితిని తప్పకుండా చక్కబరచగలమని మనవిచేసుకుంటున్నాం."

ఆ లేఖను చదివిన రాజుగారు విదేశీయులను వెంటనే లోపలికిపిలిపించి,తాను మొదట విన్న భార్యాభర్తల సంభాషణ గురించి వారికి చెప్పాడు.

"ఆ భార్యాభర్తలు ఏ సందర్భంలో అలా మాట్లాడుకున్నారో అది తెలుసుకోవటం అవసరం," అన్నారు విదేశీయులు.

రాజు మారువేషం వేసుకుని,కొత్తవాళ్ళను వెంటబెట్టుకుని, తిన్నగా భార్యాభర్తలుండే ఇంటికి వెళ్ళాడు. తలుపు తట్టి ఇంటి మగవాడిని పిలిచి, "నువ్వు ఇటీవల నీ భార్యతో, నీకు అన్నీ తెలుసుననీ, రాజ్యం ఏలటం కూడా తెలుసుననీ అన్న సంగతి గుర్తున్నదా?" అని ప్రశ్నించాడు.

"నా ఇంటిని ఏలటమే నాకుచాతకాలేదు, రాజ్యం ఎక్కడఏలి ఏడుస్తాను? నా భార్య వంట పాడుచేస్తే మాటవరసగా అన్నాను. చాతావాతా గాని మనిషి అస్తమానమూ, 'నీకేమీ తెలీదు, నీకేమీ తెలీదు,' అంటుంటే ఎలా ఉంటుంది మీరే చెప్పండి," అన్నాడు మగవాడు విసుగ్గా.

"చూశారా, మహాప్రభూ! సామాన్యప్రజలు మాటవరసగా అనే ప్రతిమాటా పట్టించుకుంటే ఎంత ఇబ్బందో? మీకీపాటి చెప్పే మంత్రులైనా లేకపోయారా?" అని విదేశీయులు రాజుతో అన్నారు.

లేదు అన్నట్టు రాజు తల అడ్డంగా ఊపాడు. వాళ్ళు మంత్రులుగా పనిచెయ్యటానికి ఒప్పుకున్నారు. తరవాత రాజ్యపాలన సవ్యంగా సాగిపోయింది.





# దొంగ దామోదరుడు

కోసలరాజ్యంలోని ఒక నగరంలో, దామోదరు డనే దొంగ వుండేవాడు. వాడు యువకుడు. దొంగతనాలు చేయడంలో గొప్పనేర్పరి. ఎటు వంటి ఇంటి తాళాన్నయినా అవలీలగా తెరవ గలిగేవాడు. ఏమాత్రం చప్పుడు కాకుండా పిల్లిలా పొంచి నడవడం, ఎంతటి చీకటిలోనూ, ఏ వస్తువు ఎక్కడ వున్నదో గుర్తించగలగడం వాడి ప్రత్యేకత.

అంత చిన్నవయసులోనే చోరకళలో వాడు కనబరిచే నైపుణ్యం చూసి, దొంగల ముఠాలో ఆడపిల్లలున్న తండ్రులు మా అమ్మాయిని పెళ్ళాడమంటూ అడిగేవారు. దానికి వాడు, ''రాజుగారి ఖజానా కొల్లగొట్టాలన్నది, నా ప్రతిజ్ఞ! అది నెరవేరేవరకూ, ఈ పెళ్ళిసంగ తులు నా దగ్గర తేకండి,'' అనేవాడు.

దామోదరుడు కలిసి తిరిగే దొంగల గుంపులో సూరనందుడనే ముఖ్యుడొకడు ఉండేవాడు. ఒకసారి వాడు, ఈ సూరనందుడి కూతురు గౌరి అనేదాన్ని చూడడం జరిగింది. ఆ పిల్ల చక్కనిచుక్క అందాలభరిణ. దొంగల గుంపులో అంత అందగత్తె అయిన ఆడపిల్ల మరొకతె లేదు.

దామోదరుడికి గౌరిని పెళ్ళాడాలన్న బల మైన కోరిక కలిగింది. రాజుగారి ఖజానా కొల్ల గొట్టడం అంత త్వరలో అయ్యేపనికాదు! ఈ లోపల గౌరిని మరెవడైనా పెళ్ళాడేయ వచ్చు- అనుకుని, ఒకనాడు వాడు గౌరి తండ్రిని చూడబోయాడు.

సూరనందుడు, వాణ్ణి వచ్చిన పనేమిటని అడిగేలోపలే, దామోదరుడు అతడికి నమ స్కారం చేసి, ''నా పేరు దామోదరుడు...'' అంటూ ఏదో చెప్పబోయాడు.

సూరనందుడు నవ్వి, ''నీ పేరు దామోద రుడనీ, ఈ వయసుకే చోరవిద్యలో ఆరితేరిన వాడివనీ-ఒక్క రాజభటులకు తప్ప, మిగతా వాళ్ళందరికీ తెలిసిందే. సరే, ఇంతకూ ఈ పేదవాడింటికి ఎందుకువచ్చినట్టు?'' అని అడిగాడు.

ఎస్.శివనాగేశ్వరరావు

దామోదరుడు తాను వచ్చిన పనేమిటో చెప్పేందుకు సంశయిస్తూనే, "నేను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను," అంటూ ఆగిపోయాడు.

ఆ జవాబుకు సూరనందుడు చిరునవ్వు నవ్వి, "చాలా మంచి ఆలోచన! ఇందులో నా సాయం ఏమన్నా కావాలా? పిల్ల ఎవరు?" అన్నాడు.

ఈసారి దామోదరుడు ధైర్యంగా, "మీ అమ్మాయి గౌరిని పెళ్ళాడాలనుకుంటున్నాను," అనేశాడు.

ఆ జవాబుకు సూరనందుడు ఆశ్చర్యపోయి, "అంటే, గౌరిని నువ్వు బాగా ఎరుగుదువన్నమాట! అందంలో దానికదే సాటి. కానీ బుద్ధిమాటకొస్తే మహాగడుసు. మనం నేర్చిన విద్య అంటే చిన్న చూపు. నిన్ను అల్లుణ్ణి చేసుకోవడం అంటే నాకు చాలా సంతోషం. కానీ, దాని మనసుకూడా తెలుసుకోవాలిగదా!" అంటూవెళ్ళి, ఇంట్లో ఏదో పని చేసుకుంటున్న గౌరిని పిలుచుకు వచ్చాడు.

గౌరి తండ్రి చెప్పింది విని, దామోదరుడితో, "నువ్వు దొంగతనంలో ఆరితేరిన వాడివని ఆనోటా ఈనోటా విన్నాను. అయినా అది నేను స్వయంగా చూడాలి కదా!. నా దగ్గరవున్న విలువైన వస్తువేదైనా,నాకు తెలియకుండా దొంగిలించు. అప్పుడే మన పెళ్ళి!" అన్నది.

"అదెంత పని!" అని దామోదరుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

రెండురోజుల తర్వాత, గౌరి పక్కఊళ్ళో జరుగుతున్న తిరణాల చూడాలని వెళ్ళింది. ఆ విషయం తెలుసుకున్న దామోదరుడు, వేషం మార్చుకుని, ఒక తట్టలో రకరకాల



లక్కబొమ్మలు పెట్టుకుని తానూ తిరణాలకు వెళ్ళాడు. గౌరి తిరణాలలోని వింతలూ, విశేషాలూ చూడసాగింది. దామోదరుడు కొంచెం దూరంలో రహస్యంగా ఆమెను అనుసరించసాగాడు. గౌరి మెడలో చంద్రహారం అలంకరించుకు వచ్చింది. అది దొంగిలించి, తన నేర్పరితనం ఆమెకు తెలియపరచాలనుకున్నాడు వాడు.

గౌరి ఒకచోట రంగులరాట్నం చూసి, అది ఎక్కి తిరగాలనుకున్నది. ఆ రద్దీలో గౌరి రంగులరాట్నం ఎక్కుతూండగా, దామోదరుడు ఒడుపుగా ఆమె మెడలోని చంద్రహారాన్ని దొంగిలించాడు.

మర్నాడు వాడు సూరనందుడి ఇంటికి పోయి, గౌరిని పిలిచి, "పాపం, నువ్వు చాలా దిగులుపడిపోయి వుంటావు! తిరణాలలో నీకు తెలియకుండా, నీ మెడలోని చంద్ర

హారాన్ని దొంగిలించాను గదా,'' అన్నాడు ఉత్సాహంగా.

అందుకు గౌరి పకపకమంటూ నవ్వి, ''తిరణాలకు నువ్వు బొమ్మలమ్మేవాడి వేషంలో రావడం, అక్కడ, నా చంద్రహారాన్ని దొంగిలించడం, అన్నీ గమనిస్తూనే వున్నాను. నువ్వు చిన్నాచితకా దొంగతనాలకన్నా పనికిరావు. నువ్వు దొంగిలించింది పూతబంగారపు చంద్రహారం!'' అన్నది.

ఆ మాటలు వింటూనే దామోదరుడు చేతిలో వున్న హారాన్ని జారవిడిచి, గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

గౌరి, వాడు మళ్ళీ వస్తాడేమో అని రెండు రోజులు ఎదురుచూసి, వాడు రాకపోయేసరికి, తనే వాడింటికి వెళ్ళింది. దామోదరుడు నులక మంచం మీద కళ్ళుమూసుకుని పడుకుని వున్నాడు. గౌరి గట్టిగా చప్పట్లు చరిచి, ''ఏం, నిద్రపోతున్నావా లేక రాజుగారి ఖజానా దోచేందుకు ఏదైనా పన్నాగం వేస్తున్నావా?'' అని అడిగింది.

దామోదరుడు మంచంమీద లేచి కూర్చుని, ''రాజువారి ఖజానా దోచడమా? ఛీ, ఛీ, నీకు తెలియకుండా, నీ మెడలోని చంద్రహారమే దొంగిలించలేకపోయాను! లోగడ ఏవో దొంగతనాలు చేశానుగానీ, కాస్త గిట్టుబాటయ్యే పెద్ద దొంగతనాలు చేసే తెలివితేటలు నాలో లేవు,'' అంటూ పెద్దగా ఉస్సురుమన్నాడు.

వాడి మాటలకు సంతోషించిన గౌరి, ''తెలివితేటలున్నా దొంగబతుకు దినదిన గండం, నీచం!'' అన్నది.

''మరిబతుకుతెరువుకు, నేనేంచేయాలి?'' అన్నాడు దామోదరుడు దిగులుగా.

అందుకు గౌరి చిరునవ్వు నవ్వి, ''ఇక్కడికి రెండామడల దూరంలో, మా మేనమామల గ్రామం వుంది. వాళ్ళు వ్యవసాయదారులు, పెద్ద బలగం. మనం ఈ దొంగల గుంపును వదిలి వాళ్ళల్లో చేరిపోదాం. మనపెళ్ళి అక్కడే. ఏమంటావు?'' అని అడిగింది.

దామోదరుడు ఒక క్షణం ఆలోచించి, ''నువ్వు చెప్పినదంతా నాకిష్టమే. మీ నాన్న ఏమంటాడో!'' అన్నాడు.

''ఇక్కడికి వచ్చేముందు, నాన్నతో అన్నీ మాట్లాడే వచ్చాను. లేమరి, వెళ్దాం,'' అన్నది గౌరి.

దామోదరుడు గౌరితో, కానున్న మామగారింటికేసి బయలుదేరాడు.



ఇదొక చందమామ కానుక!

14

# అజేయుడు గరుడుడు!

చిత్రాలు: పాణి

రాజు మహేంద్రవర్మను ఎవరో అపహరించుకుపోయారన్న వదంతి చంద్రపురిలో వ్యాపించింది. రాజు ఉన్నచోటును తాంత్రిక వేత్త నాగబంధు చెప్పగలడని ఒక భూతవైద్యుడు నరేంద్రదేవుడికి జోస్యంచెప్పాడు. నరేంద్రదేవుడు తంత్రవేత్తను చూడడానికి అడవికి వెళ్ళి ఆయన ఉన్న చోటును సమీపించాడు. వచ్చినవాళ్ళందరూ అక్కడి నియమాలను పాటించాలని నాగబంధు శిష్యుడు నరేంద్రదేవుడికి చెప్పాడు.

నరేంద్రదేవుడికి కోపం వచ్చింది.

మా గురువుగారి నియమాలను ఎవరైనాసరే పాటించవలసిందే.

నేను సేనాధిపతినన్న విషయం వాళ్ళకు తెలియదా? నన్నే ఎలా ఆజ్ఞాపించగలరు?

అవుననుకో. ఇక్కడి నియమాలను పాటించి నట్టయితే, మా గురువుకు ఆనందం కలిగించిన వారవుతారు.

నరేంద్రదేవుడూ, మిగతావాళ్ళూ వినేవిధంగా భూతవైద్యుడు ఒక ప్రకటన చేశాడు.

మన గురువుగారు దర్శనమిచ్చేది కొన్నిరోజులు మాత్రమే. ఆ సమయంలో ఆయన భక్తులనుంచి సంపూర్ణ శరణాగతిని ఆశిస్తారు. ఆయన్ను మనం సర్వశక్తి సంపన్నుడిగా అంగీకరించాలి!


మానవజాతి
సంక్షేమం ఆశించి,
ఇద్దరు మహాపురుషులు ఈనాడు
శుభఘడియల్లో కలుసుకోనున్నారు.
ఇదొక మహత్తరమైన రోజు!


భూతవైద్యుడు నరేంద్రదేవుణ్ణి తృప్తిపరచడానికి అతన్ని పొగడసాగాడు.
ప్రభూ! మీకు ఉజ్వల భవిష్యత్తు ఉంది. రాజర్షి నాగబంధు సాయంతో మీరు రాజు కాగలరు. చక్రవర్తి కూడా కాగలరు.
మా గురుదేవుల ఆగమనానికి వేచి ఉండండి. ఆయన రాక ఒక అద్భుత దృశ్యం. ఆయన సూచనలు మీకు మేలు కలిగిస్తాయి!
ఆయన సూచనలన్నిటినీ శిరసావహిస్తాను. ఇప్పుడు ఏం చేయాలో చెప్పండి.


కొంతసేపటికి ఆ ప్రాంతాన్నంతా ఒకవిధమైన పొగ ఆవరించింది. ఆలయంకేసి ఒక భయానక ఆకారం రాసాగింది. ఆ వ్యక్తి తలమీద రెండు మణులు పాము కళ్ళలా మెరుస్తున్నాయి. ఆయన వీపు వెనక రెండువైపులా పాముచర్మాల్లాంటి పొడవాటి వస్త్రాలు వేలాడుతున్నాయి.

నడుముకు కట్టుకున్న వస్త్రం తప్ప శరీరానికి ముందువైపు ఎలాంటి ఆచ్ఛాదనా లేదు. ఒళ్ళంతా రాసుకున్న మూలికల భస్మం ఘాటైన వాసనలు వెదజల్లుతున్నది. ఆయన మెడ చుట్టూ రెండు సర్పాలు హారాల్లా చుట్టుకుని ఉన్నాయి. నరేంద్రదేవుణ్ణి దాటుకుని వెళుతూన్నప్పుడు తాంత్రికుడు ఒక్కక్షణం ఆగి వికటాట్టహాసం చేశాడు.







తమ లక్ష్యం నెరవేరాలంటే, ఎలాంటి సంకోచమూ ఉండకూడదు.
అలాగే! ఇప్పుడే వెళ్ళి దుస్తులు మార్చుకుని వస్తాను.


నరేంద్రదేవుడు తిరిగి వచ్చినప్పుడు, ఏదో మంత్రశక్తికి లోబడినవాడిలా మౌనంగా తాంత్రికుడి పాదాలకు సాష్టాంగ నమస్కారం చేశాడు.


మిత్రమా! లెమ్ము! నావెంట వచ్చి, పక్కన ఆసీనుడవై క్రతువును భక్తిశ్రద్ధలతో తిలకించు!
ఇంకావుంది



వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు జూన్ 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

ఫిబ్రవరి 2002 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:

బి.సత్యనారాయణ (టీచర్)
విశ్వోదయ హైస్కూల్, బోర్గాం (పి),
నిజామాబాద్ జిల్లా-503230. (అం.ప్ర)

బహుమతి పొందిన వ్యాఖ్యలు





మొదటి ఫోటో : అందినది బొమ్మ!
రెండవ ఫోటో : ఆడుకుందాం రామ్మా!!




Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited. No. 82. Defence Officers Colony. Ekkatuthangal. Chennai - 600 097. Editor : Viswam

